# ఇల్లు ఇరకటం - ఆలి మరకటం

—— శ్రీ శివచిదానంద భారతీస్వామి

ఇల్లు ఇరకటం, ఆలి మరకటం అను సామెత ఆంధ్రదేశములో బహుళ ప్రచారములో యున్నది. దాని ప్రకారము నివసించు గృహము చాలా ఇరుకుగా ఉండవలెనని చెప్పుదురు. దాని ఔచిత్యమును సమన్వయ పరచుటకు విపరీతమైన హేతువులను వినిపించుటయు కలదు అటులనే ఆలి మర్కట రూపము కలిగి ఉండవలెననుటలో కూడా చాలా కారణములు చూపు సందర్భములు కలవు. మన ఆచారము, జీవన విధానములను బట్టి చూడగా నివసించు ఇల్లు సువిశాలముగా ఉండవలెనని ఒక చోట వంట, మరియొకచోట నిద్ర, మూడవచోట పూజ, నాల్గవచోట లౌకిక వ్యవహార నిర్వహణకు అన్ని వసతులు గల గృహ నిర్మాణము చేసుకొనుచు ఇల్లు ఇరికాటమనుటలో ఎట్టి ఔచిత్యము గోచరించుటలేదు, మరియును ఆలిని లక్ష్మి అని, గృహమేధి అని, సర్వాలంకార భూషితగా చేసుకుని శయనేషు రంభగా కాంక్షించే గృహస్థులు భార్యను కురూపిగా కోరుకొనుటలో ఎట్టి ఔచిత్యము లేదు. అదియును గాక ఈ సామెత బహుళ ప్రచారములో ఉన్నప్పటికి సామెతపై విశ్వాసముతో విశాలమైన భవంతులు త్యజించి, ఇరుకు ఇంటిలో నివసించదల్చిన వారుగాని, స్ఫురద్రూపి అయిన కన్యను కాదని కురూపిని వివాహమాడిన సందర్భములు గాని లేవు. ఆ సామెతలోని నిజార్థము అదియే అయినచో ఆచరణలో పెట్టినవారు ఉదాహరణకు ఒక్కరును లేరు కదా! దానినిబట్టి ఆ సామెతలోని గూఢార్థము బాహ్య అర్థమునకు భిన్నముగా ఉండి తీరవలయును దానిని తెలుసుకొనినచో ఈ అపార్థము నిషిద్ధమవగలదు నిజముగా ఈ సామెత గృహవాస్తుకు సంబంధించిన ముఖ్య సూత్రమైయున్నది అది ఏదన, గృహ నిర్మాణమునకు ఇరు కవాటములు ఉండవలెనని, అనగా రెండు ద్వారములు ఉండవలెనని, భార్య ఎల్లవేళల మరు కవాటమునందు ఉండవలెనని తాత్పర్యము ప్రతి గృహమునకు ఉండవలసిన రెండు ద్వారములలో పురుష సంచారమునకు సింహద్వారము అనగా వీధి గుమ్మం, స్త్రీ సంచారమునకు పాణి ద్వారము లేక లక్ష్మి ద్వారము అనగా దొడ్డి గుమ్మం అవసరముగా ఆ సూక్తి పుట్టినది భాషాపరిణామములో ఆ సూక్తి వికృతరూపము పొంది భయంకరార్థము కలుగులాగున పరిణామము చెందినది అందువలన ప్రతి సామెతకు అంతరార్థము తెలుసుకొన ప్రయత్నించిన గాని దాని పూర్వాపరములు తెలియజాలవు. అందువలన ఇల్లు ఇరుకుగా ఉండవలసిన అవసరము గాని, భార్య కురూపి కావలసిన అవసరము గాని లేదని చదువరులు గ్రహించగలరు.

)–○–(

ఆగస్టు 1995
సంపుటి : 11
సంచిక : 8



మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం - 521 001
ఫోన్ : 22818

విడి ప్రతి : రు. 4-50
సంవత్సర చందా : రు. 54-00
4 సం॥ల చందా : రు. 200-00
జీవిత సభ్యత్వం : రు. 600-00
పోషకులు : రు.1,116/-

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM
Phone : **21137**

Despatched on 7-8-1995

# విషయ సూచిక



ముఖచిత్రం : విఘ్నేశ్వరుడు



# గణపతి తత్త్వము

—శ్రీసంతోష్

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఒక పర్యాయం గణపతి తత్త్వమును వివరిస్తూ 'గ' అనగా బుద్ధి, 'ణ' అనగా విజ్ఞానము అని విజ్ఞాన ప్రజ్ఞానములకు అధిపతి 'గణపతి' అన్నారు. సర్వగణములకు అధిపతి అయినటువంటివాడే 'గణపతి' అని, గణములనగా మానవుని యొక్క ఇంద్రియ తత్త్వములేనని కనుక సమస్త ఇంద్రియములకును అధిపతి అయినవాడే 'గణపతి' అని బాబావారు చెప్పారు

"విగతో నాయకః ఇతి వినాయకః" అనగా అతను ఎట్టి నాయకుడు లేనటువంటివాడు, అతనే సర్వులకూ నాయకుడు అన్నింటికినీ తానే అధిపతి. అదే 'వినాయక' అనే పదమునకు సరియైన అర్థము. వినాయకునికి ఏనుగు తల ఎందుకు పెట్టారు? అని కొందరు ప్రశ్నిస్తుంటారు ఏనుగు తల అధికమైన తెలివితేటలకు చిహ్నమని, మనమైనా కళ్ళుమూసుకొని అడుగువేస్తామేమోగాని, ఏనుగు మాత్రం ముందుచూడక అడుగువేయదని, అందువలననే సర్వ సద్గుణాలకు నిలయంగా ఏనుగు తలను విఘ్నేశ్వరునికి పెట్టారని బాబా చెప్పారు. సర్వగణములకేగాక, సర్వ గుణము అధిపతి 'గణపతి' అన్నమాట.

ఏనుగు శరీరము అతి భారీగా ఉన్నప్పటికినీ దేహమును అంతతేలికగా చేసుకొని ఏనుగు నీటిలో ఈదుతుంది అందువలననే 'గజ ఈత' అని పేరు వచ్చింది. సంసారమనే సాగరాన్ని గజతత్త్వము అనగా గణపతి తత్త్వము అతితేలికగా దాటిస్తుందని బాబా చెప్పారు

గణపతికి కుడుములు, ఉండ్రాళ్లు నైవేద్యంగా పెడుతుంటాం దీనికి కారణమేమిటి? వీటిని నూనెలో ఉడికించరు ఇవి ఆవిరితోనే తయారవుతాయి. ఆవిరిలో పెట్టి ఉడికించిన పదార్థము అతి సులభంగా జీర్ణమవుతుంది కొందరు ఈ ఉండ్రాళ్ళలో నువ్వులు కూడా వేస్తుంటారు నువ్వులు శ్వాసరోగములకు, కంటి రోగములకు దివ్యమైన ఔషధమని చెబుతూ ఆరోగ్యమును, ఆనందమును దృష్టిలో పెట్టుకొని మన ప్రాచీనులు పూజలు ఏర్పరిచారని చెప్పారు బాబా

ఆరోగ్యం బాగుంటేనే మనస్సు ప్రశాంతంగా, నిర్మలంగా, పరిశుద్ధంగా ఉంటుంది అప్పుడే బుద్ధి వికసిస్తుంది. బుద్ధి వికసించినప్పుడే సిద్ధత్వము ప్రాప్తిస్తుంది. కనుక మనోపరిశుద్ధము చేతనే బుద్ధి, సిద్ధి రెండూ కూడనూ సంప్రాప్తమవుతాయి. ఈ బుద్ధిని, సిద్ధిని వినాయకుడు వరిస్తాడు జ్ఞానసిద్ధియే నిజమైనటువంటి సిద్ధి మనోసిద్ధియే నిజమైన సిద్ధి కనుక ఈ సిద్ధి, బుద్ధికి, క్షేమము, ఆనందము అనే కొడుకులు పుడుతారు అందువలననే క్షేమానందములు రెండూ వినాయకుని పుత్రులని, బుద్ధి సిద్ధులు రెండూ వినాయకుని పత్నులని పురాణములు చెబుతున్నాయని, బుద్ధి, సిద్ధులతో కూడిన గణపతి మానవుని యొక్క పూర్ణమైన, పరిశుద్ధమైన హృదయమును మాత్రమే ఆకర్షిస్తాడని బాబా చెప్పారు.

కనుక మనం మొట్టమొదట పరిశుద్ధమైన మనస్సును అభివృద్ధిపరచుకోవాలి దుర్గుణములను, దురాలోచనలను దూరం చేసుకొని, సద్గుణములను, సదాలోచనలను సమీపించడానికి ప్రయత్నం చేయాలి.

)-◡-(

# పండుగల పరమార్థం

—కొమరగిరి జయప్రద

" ఓంకార పంజర శుకీం
ఉపనిష దుద్యాన కేళి కలకంఠీం
ఆగమవిపిన మయూరిం
ఆర్యామంతర్విభావయే గౌరీం॥ "

శ్రావణమాసంలో మంగళగౌరీ వ్రతం, శ్రీ వరలక్ష్మి వ్రతం ముఖ్యమయినవి 'అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ' శ్రీ మంగళగౌరమ్మ శ్రీ మంగళగౌరీ వ్రతం ఐదు సంవత్సరములు చేసుకుంటే చాలు స్త్రీకి ముఖ్యమయిన సుమంగళీత్వాన్ని ప్రసాదిస్తుంది పెద్ద ముత్తయిదువ పార్వతమ్మ పెండ్లి కాని కన్నెపిల్లలు, పెండ్లయిన సుమంగళులు తప్పక చేసుకోవలసిన వ్రతము ఇది ఇక శ్రీ లక్ష్మి స్తోత్రములలో అష్టలక్ష్మి స్తోత్రము ప్రసిద్ధి చెందినది. 1) ఆదిలక్ష్మి 2) ధాన్యలక్ష్మి 3) ధైర్యలక్ష్మి 4) గజలక్ష్మి 5) సంతానలక్ష్మి 6) విజయలక్ష్మి 7) విద్యాలక్ష్మి 8) ధనలక్ష్మి కానీ ఏ లక్ష్మి అయినా శ్రీ మహాలక్ష్మి అంశలోనిదే ఆమె కోరిన వరముల నొసగే శ్రీ వరలక్ష్మి. శ్రావణ పూర్ణిమకు ముందువచ్చే శుక్రవారం ఈ వ్రతానికి ఎంతో ముఖ్యమయినది.

శ్రీకృష్ణాష్టమి కూడా ఈ నెలలోనే వచ్చింది. నల్లనయ్య మానవాకారంలో మన మధ్యకు వచ్చిన రోజు అది ఏ యుగమందైనా ధర్మము నశించి అధర్మము పెరిగినప్పుడు భగవంతుడు తనను తానే సృజించుకొని ధర్మాన్ని పునరుద్ధరిస్తాడని ప్రతీక. భౌతికసుఖాల భ్రాంతిలోపడి భగవంతుణ్ణి మరచి గమ్యం తెలియక అగమ్యగోచరుడై ఉన్న మానవునికి జ్ఞానాన్ని ఆత్మానందాన్ని పొందే మార్గాన్ని చూపించటానికి ఎందరో మహానుభావులు ఆవిర్భవించారు. కొన్ని సందర్భాలలో భగవంతుడే మానవరూపం ధరించి వచ్చాడు.

" మత్స్యః కూర్మ వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ
కృష్ణః కల్కి రేవచ. "

ఈ శ్లోకములో అవతారముల పేర్లతోపాటు అవతార క్రమము కూడా తెలుస్తున్నది. వరుసలో కృష్ణావతారము తొమ్మిదవది. పూర్ణమయిన తొమ్మిదివలెనే పరిపూర్ణమయినది ఈ అవతారము. పుట్టుకతోడనే శంఖ చక్రాది చతుర్భుజములతో తల్లిదండ్రులకు దర్శనమిచ్చాడు. ఐదు సంవత్సరములకే రాక్షసులను సంహరించి గోవర్ధనగిరి నెత్తి ఆరవ ఏటనే గోపికా వస్త్రాపహరణము గావించి గోపికలకు దేహముపైనున్న మోహాన్ని వారిలోని అజ్ఞానాన్ని తొలిగించాడు. గోకులంలోని స్త్రీ బాల వృద్ధులందరూ బాలకృష్ణుని ఒక గురువుగా, దైవంగా భావించి తమ సర్వస్వాన్ని పరమాత్మకు సమర్పించారు. వారిది విడదీయరానిబంధం అందుకే గోపాలుడు గోపీలోలుడు అయినాడు అజ్ఞానమనే అడవిదారినుండి సుజ్ఞానమనే బాటను ఎన్నుకునే విజ్ఞానాన్ని కలిగించే గురువు దొరకటం పూర్వజన్మ సుకృతం భారతయుద్ధంలో కృష్ణపరమాత్మ అర్జునునికి కేవలం రథసారధే కాక నిజజీవితంలో కూడా ఇంట వెంట జంట గురువు దైవము తానై ఉన్నాడు కాబట్టే అర్జునుడు అన్నిటియందు విజయుడైనాడు పరమాత్మ పార్థసారధి అయినాడు ఆ యిద్దరూ నరనారాయణులైనారు ఆ దేవకీనందనుని పుట్టినరోజే ఈ జన్మాష్టమి శుభదినం ఏ వ్రతమైనా, ఏ నోము అయినా త్రికరణ శుద్ధిగా చేస్తే అది అనంతమైన ఫలములిస్తుంది. అందుకే జగద్గురువు అయిన శ్రీకృష్ణుడు గీతలో "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన" అన్నాడు ఫలముల నాశించక కర్మ చేయమన్నాడు 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' శ్రద్ధగలవానికే జ్ఞానం అన్నాడు 'సంశయాత్మా వినశ్యతి' సంశయములు గలవానికి సుఖంలేదు అన్నాడు 'అనన్యాశ్చింతయంతోమాం' ఎల్లప్పుడు తననే నమ్మకోమన్నాడు పరమాత్మ. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అన్నాడు చివరకు. కాబట్టి పిండివంటలతో, కొత్త బట్టలతో పండుగ దినములను వృధాచేయక అందులోని అర్థాన్ని పరమార్థాన్ని గ్రహించి ఆచరించి ఆనందించటం ప్రతిఒక్కరూ నేర్చుకోవాలి.

౫ లబ్ధ్వా కథంచిత్ నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం, శ్రుతిపారదర్శనం
యః స్వాత్మముక్త్యై నయతేత మూఢధీః
స 'ఆత్మహా' స్వం వినిహంత్యసద్గ్రహాత్ ॥

## అమృతవా

నిజంగా మానవ జన్మ దొరకటం గొప్ప అదృష్టమే. కనుకనే శంకరులు వివేక చూడామణి ప్రారంభంలో 'జంతూనాం నరజన్మ దుర్లభం' అంటూ దాని ప్రాధాన్యాన్ని వక్కాణించారు జన్మ పరంపరలో ఈ మానవ జన్మ ఎంత పుణ్యం చేసుకొంటే లభించుతుందో ! అందులోను పురుషుడుగా పుట్టటం యింకా విశేషంట. దీనివల్ల స్త్రీగా పుట్టటం హీనంగా భావించనక్కర్లేదు. స్త్రీ పురుషుల్లో తారతమ్య పరిశీలన చేసినప్పుడు పురుష ప్రకృతి కొంచెం మొగ్గు చూపించక తప్పదు

అయితే స్త్రీలు అన్ని రంగాల్లోను పురుషులతో సమానంగానే వుండటం కూడా కాదనలేము. ఆధ్యాత్మిక రంగంలోను, కర్మానుష్ఠానంలోను పురుషులకున్న యెక్కువ అవకాశం స్త్రీలకు కుదరదు

యజ్ఞ యాగాది క్రతు నిర్వహణలోను వేదశాస్త్రాదుల అధ్యయన, స్వధర్మానుష్ఠానాదుల్లోను తపశ్చర్యాదుల్లోను శ్రమకోర్చుకోగల శరీరం అవసరం కూడా విధిగా మగవారికే వుండటం కూడా కారణం కావచ్చు మగవాడు పడే శారీరక శ్రమకు స్త్రీ శరీరం అనుకూలం కాదు. వారిది కోమలమైన శరీరం కావటంచేత మగవారికిలాంటి విషయాల్లో సహధర్మచారిణులుగా మాత్రమే వుండటం పరిపాటి. గృహిణిగా ఆమె బాధ్యత చాలా గొప్పది ఇంటిపట్టున నీడలోనే మసలుతూ సంసారం దిద్దుకోటం తక్కువ విషయం కాదు

ఒంటరిగా ఎంత దూరమైనా ప్రయాణంచేసి చదువు సంధ్యలు నేర్వటం కుటుంబ పోషణార్థై నానా అగచాట్లు పడి నాలుగు డబ్బులు సంపా [illegible] లాంటి విషయాల్లో మగవానికున్న అవకాశాలు స్త్రీకి లేవనేది నిజం ఇలాంటి విషయాల్లో లోతుగా వ్యాఖ్యానించకుండానే సాధక బాధకాలు గ్రహించగలం

పురుష శరీరం సంపాదించగానే సరిపోదు వాళ్ళల్లోను తారతమ్యం లేకపోలేదట. ఎన్నో రకాల విద్యలు నేర్చి మగవాళ్ళు పొట్టపోసుకుంటున్నారు. కాని పరమార్థ దృష్టితో వేదాధ్యయనం చేసేవారు చాలా తక్కువ వేద శాస్త్రాధ్యయనం కేవలం ఆధ్యాత్మిక జ్ఞాన సంపదకోసమే ననేది గ్రహించాలి కాని లోకంలో పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయాలంటే ఈ వేదాదులు పనికిరావని అందరూ భౌతిక విద్యలనే నేర్వటానికిష్టపడతారు.

మరి అలాంటప్పుడు జ్ఞానంకోసమనే వేదశాస్త్రాధ్యయనంచేసే మగవారు గొప్పవారెందుకుకారు? తప్పకుండా విశిష్టులనే చెప్పాలి ఈ చదువుల్లో గురు శిష్య సంబంధం ఎక్కువ బ్రహ్మచర్యాది నియమపాలన మెండు గురు శుశ్రూషా ప్రధానాలీవిద్యలు స్త్రీలు ఇలాంటి బాధ లెక్కడ పడగలరు చెప్పండి ? పురుషుల్లోనే అందరూ కోరనిది ఈ శిక్షణ కోరి కష్టాలకు ఇష్టపడరు

వేదశాస్త్ర పండితుల్లో కూడా ఉత్తమ తరగతి వుంది వేదశాస్త్రాధ్యయనానికి లక్ష్యమైన ముముక్షుత్వం జన్మ యెత్తిన ప్రతి మానవునికీ గమ్యం మోక్షం అంటే మాటిమాటికి జనన మరణాలు పొందకుండా శాశ్వతంగా భగవత్సాయుజ్య సుఖం పొందటం పునరావృత్తి లేని మోక్షం కావాలనే కోరిక వేదాదులు అధ్యయనం చేసిన వాళ్ళ లక్ష్యమై వుండాలి అలాంటి ముముక్షువులు వేదవేత్తల్లో వుత్తములవుతారు

ఈ విధంగా దుర్లభమైన మానవజన్మ సంపాదించి పురుష శరీరాన్ని పొంది, చక్కగా వేదశాస్త్రపారంగతుడైనవాడు మోక్షంకోసం ప్రయత్నం చేయటం సక్రమమైన పద్ధతి అలా కాక ఇంతవరకు వచ్చి ఇంద్రియలోలుడై భౌతిక సుఖాలను వాంఛిస్తూ పరమ లక్ష్యమైన మోక్షంకోసం ప్రయత్నమేమీ చేయదనుకోండి అలాంటి వాణ్ణి ఏమనాలి ? ఈనగాచి నక్కలపాలు చేసినట్లు తన జన్మను విద్యను వ్యర్థం చేసుకొన్న మూఢుడనాలి అతణ్ణి

అసలు మనిషికి వుండవలసిన స్వార్థం మోక్షమే. దీన్ని వదిలేసి కేవలం అర్థ కామాలనాశించే ఇలాంటి మూర్ఖులు ఆత్మహత్య చేసుకున్నట్లే. ఉండవలసిన మోక్షమనే స్వార్థాన్ని వదలి వుండకూడని అర్థ కామ సంబంధమైన స్వార్థాన్ని ఆశ్రయించకూడదని భావం. 0



# ప్రేమతత్త్వాన్ని అందరికీ పంచండి! హృదయంలో ప్రేమను నింపండి!

**-భగవాన్ సాయి దివ్యసందేశం**

ప్రేమస్వరూపులారా!

నువ్వులలో నూనె ఉండినట్లుగా, పాలలో వెన్న ఉండినట్లుగా, పువ్వులలో సుగంధ పరిమళం యిమిడి వుండినట్లుగా, ఫలములో మాధుర్యమైన రసం వుండినట్లుగా, కర్రలో అగ్ని వుండినట్లుగా: ఈ యావత్ ప్రపంచమునందును కూడనూ భగవంతుడు అంతర్లీనమై ఉన్నాడు.

దివ్యత్వమైనటువంటి ఆత్మతత్త్వమును గుర్తించుటకు అనేక విధములైన ప్రయత్నములు చేయవలసి వస్తుంది. పాలను పితికినంతమాత్రమున మనకు వెన్న లభ్యముకాదు. నువ్వులను చేతిలో వుంచుకున్నంత మాత్రమున తైలము మన చేజిక్కదు. వాటిని చేయవలసిన రీతిలో కొన్ని ప్రక్రియలు సలిపినప్పుడే, నువ్వులలో వున్నటువంటి తైలము, పాలలో వున్నటువంటి వెన్న మనకు లభ్యమవుతుంది. అదే విధముగనే సర్వత్రా వుండినటువంటి భగవత్ తత్త్వము లభ్యము కావలెనన్న అనేక విధములైన సాధనలు చేయవలసి వస్తుంది. దీనినే 'నవవిధ భక్తి' అని చెబుతూవచ్చారు.

"శ్రవణం, కీర్తనం, విష్ణోః స్మరణం
పాదసేవనం, అర్చనం, వందనం
దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం"

ఇందులో ఏ ఒక్కటైననూ మానవుడు చిత్తశుద్ధితో ఆచరించినప్పుడు దివ్యత్వమనేటటువంటి ఆత్మతత్త్వము ప్రతివ్యక్తికి కూడనూ అవ్యక్తమవుతుంది.

సమావేశము ప్రారంభించుటకు పూర్వం జ్యోతిని వెలిగించాం. ఈ దీపమునకు వున్న శక్తి సామర్థ్యములు ప్రపంచంలో మరో వస్తువుకు లేదనే చెప్పవచ్చును. అంధకారమును నిర్మూలనం గావించి, దివ్యత్వమైనటువంటి దృష్టిని ప్రసాదించి ఊర్ధ్వగతిని అందించేటటువంటిదే ఈ 'జ్యోతి'. జ్యోతి గతి ఊర్ధ్వగతే కాని, అధోగతి కాదు. ప్రాచీన కాలమునుంచి మనవారు ఈ జ్యోతిని ఆరాధిస్తూవచ్చారు. ప్రాచీన కాలమునుండి భారతీయులు ఏ మంగళకార్యం చేయవలసివచ్చినా జ్యోతిని మొదట వెలిగించి ఆ మంగళకార్యం ప్రారంభించేవారు. ఇది భారతీయ ప్రాచీన సంప్రదాయం, ఇదియే ప్రాచీన భారతీయ సంస్కృతి. ఇట్టి సంప్రదాయమును, సంస్కృతిని ఈనాడు విస్మరించి, కేవలం ఆధునిక జీవితాన్ని గడిపే నిమిత్తమై అనిత్యము, అశాశ్వతమైన సుఖముల నిమిత్తమై, ఈనాటి మానవుడు ఈ పవిత్రమైన మార్గమును విస్మరించి దుఃఖముల పాలవుతున్నాడు. ఈ జ్యోతిని వెలిగించవలెనన్న దీనికి నాల్గు విధములైన పదార్థములు అత్యవసరం 1. ప్రమిద, 2. వత్తి, 3. తైలము, 4. నిప్పు. ఈ నాల్గింటిలో ఏ ఒక్కటి లేకపోయినా 'జ్యోతి' వెలగదు. అయితే ఈ వెలుగు బహిర్ముఖమైన చీకటిని మాత్రమే నిర్మూలనం గావించుచున్నది గాని, అంతర్ముఖమైన ప్రకాశమును మానవునకు అందించడంలేదు.

హనుమంతుడు లంకను కాల్చే సమయమందు ఈ దేదీప్యమైన వెలుగు ప్రజ్వరిల్లుతూ, లంక అంతయూ పట్టపగలు వలె కనిపించింది. కాని పట్టణమంతా

ప్రకాశవంతంగా ఉండినప్పటికినీ, రావణునిలో వుండి నటువంటి అజ్ఞానము. అహంకారమనే అంధకారం కప్పబడి, తనయొక్క దివ్యభావములను, దివ్యతత్త్వమును మరిపింపజేస్తూవచ్చింది. రావణుడు బ్రహ్మ మానసపుత్రుడు. ఈతనికి కుబేరుడు అన్న. మహా బలశాలి కుంభకర్ణుడు అతనికి తమ్ముడు. ఇంద్రుని జయించిన ఇంద్రజిత్తు ఇతని కుమారుడు నాలుగు వేదములు,ఆరు శాస్త్రములు పఠించినవాడు ఈ రావణుడు. అందువలననే రావణుని "దశకంఠుడు" అన్నారు పది తలలు గలవాడేమిటని విచిత్రంగా భావించవచ్చు. పది తలలు అంటే ఏమిటి? నాలుగు వేదములు, ఆరు శాస్త్రములు చదివినవాడు కనుకనే ఇతనిని పది తలలు గల (దశకంఠుడు) వాడన్నారు. ఇంతటి శక్తిసామర్థ్యములుగల రావణుడు,కేవలం చిత్త శుద్ధి లేకపోవటంచేత అంతర్ముఖమునందు అంధకారం లోనే మునిగాడు. ఈనాటి మానవుడు ఎంతటి విద్యా వంతుడైనప్పటికినీ, ఎంతటి శ్రీమంతుడైనప్పటికినీ, ఎంతటి బలవంతుడైనప్పటికినీ దైవానుగ్రహం గనుక లేకపోతే అంతర్ముఖములో పేరుకున్న అజ్ఞానం నిర్మూలనం కాదు. కర్ణుడు కూడా మహాశక్తివంతుడు, సమస్త విద్యలూ అభ్యసించినవాడు. అయినప్పటికీ తన భుజబలమును, బుద్ధి బలమును ఆధారం చేసుకొని; ధర్మబలమును, దైవబలమును కోల్పోవటంచేతనే కర్ణుడు అనేకవిధములైన పరాభవములను చవిచూడ వలసి వచ్చింది బాహ్య సంపత్తితోపాటు అంతర్ సంపత్తిని కూడా పెంచుకోవాలి. బహిర్ముఖమైన చీకటిని దూరం గావించినంతమాత్రమున మానవత్వం వికాసించదు అంతర్ముఖమైన దివ్యజ్ఞానమును మనం వెలిగించుకున్నప్పుడే బహిర్ ముఖమునందు, అంతర్ ముఖమునందు కూడనూ మనం దేదీప్యమానమైన వెలుగును అందుకోవచ్చును. కనుక మొట్టమొదట అంతర్ముఖమైన దివ్యత్వాన్ని మనం తెలుసుకోవాలి

జ్యోతిలోని వాల్గు పదార్థములలో వైరాగ్యమే ప్రమిద, భక్తియే తైలము, చిత్తశుద్ధియే వత్తి, తత్త్వవిచారణయే నిప్పు. ఈ నాల్గింటి ఏకత్వం చేతనే జ్ఞానజ్యోతి వెలుగుతుంది. ఈనాడు ఈ ప్రపంచమంతా కష్టనష్టములచేత, భయభ్రాంతులచేత అల్లకల్లోలంగా కనిపిస్తున్నది. దీనిని ఏశక్తీ ఆపలేదు ఒక్క దైవాను గ్రహమనే శక్తితోనే దీనిని సాధించాలి. మానవత్వ ములో త్రికరణశుద్ధి అత్యవసరం. అనగా మనస్సు, వాక్కు, కాయము యొక్క ఏకత్వము అత్యవసరం. ఈ మూడింటిలో ఏ ఒక్కటి లోపించినా మానవత్వ మనిపించుకోదు కాని దురదృష్టవశాత్తు ఈనాడు ఆకారమానవులు మాత్రమే కనిపిస్తున్నారుగాని ఆచార మానవులు కనిపించటంలేదు. ఈనాడు మనం ఆచార మానవులుగా నిరూపించాలి, దివ్యత్వమైన ఆత్మతత్త్వానికి మనం నిలయము అని భావించాలి. "దేహో దేవాలయ ప్రోక్తః జీవో దేవ స్సనాతనః" మానవ దేహం భగవంతుని దేవాలయ మని భావించాలి. భగవంతుడు ప్రత్యేకంగా ఏ దేశమునందో, ఏ కాలమునందో లేడు అన్ని కాలముల యందూ, అందరి హృదయాలయందు కూడనూ భగవంతు డుంటున్నాడు.

ఈనాడు మానవుడు దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన ఆత్మతత్త్వాన్ని విస్మరిస్తున్నాడు ఈ దేహమనే టటువంటి కారులో భగవంతుడనే డ్రైవరు కూర్చొని లోకసంచారం చేస్తున్నాడు. కనుక ఈ Drive చేసే టటువంటి భగవంతుడు 'కారు' కాదు, కారు డ్రైవరు కాదు. 'నా దేహము' అన్నప్పుడు దేహము వేరు, నేను వేరు. అదే విధముగ నా కారు అనుకొన్నప్పుడు 'కారు' వేరు, 'నేను' వేరు.

దివ్యాత్మస్వరూపులారా!

మీరు కేవలం దివ్యమైన శక్తి స్వరూపులే గాని, 'ఆకారమానవులు' కాదనే సత్యాన్ని గుర్తించి వర్తించాలి. ప్రాచీనకాలమునుండి భగవత్ తత్త్వమును

గుర్తించుటకు గాని, అనుకరించుటకుగాని, ఆనందించుటకు గాని అనేకమంది మహనీయులు అనేక మార్గములను సూచిస్తూవచ్చారు భగవత్ పాదముల దివ్యశక్తిని గురించి దివ్యతత్త్వమును గురించి అనేక పురాణములు ప్రబోధిస్తూ వచ్చాయి మహాశక్తిసంపన్నుడు, ప్రతిజ్ఞాపాలకుడు, దృఢచిత్తుడు అయిన భీష్ముడు మహాభారత యుద్ధసమయంలో "రేపటి దినం లోపు పాండవులందరిని చంపివేయగలను" అని ప్రతిజ్ఞ చేశాడు ఈ ప్రతిజ్ఞ క్షణంలో సర్వత్రా వ్యాపించింది. ద్రౌపది చెవిలో కూడా ఈ దుర్వార్త పడింది. ఈమె ఈ దుఃఖమును భరించుకోలేక కృష్ణుని పాదములపై పడి "కృష్ణా ! నీవు తప్ప నాకు అన్యము దిక్కులేరు, భీష్ముని ఎదిరించగల శక్తి ఎవరికీ లేదు అది నీయందు మాత్రమే ఉన్నది. కనుక నా పతులను కాపాడి నా సుమంగళత్వాన్ని నిలుపుము' అని ప్రార్థించింది. అప్పుడు కృష్ణుడు "ద్రౌపదీ ! అతను మహా భక్తుడు, జ్ఞాని, అతని ప్రతిజ్ఞను మార్చుటకు వీలుకాదు, కాని ఒక ఉపాయం మాత్రం చెబుతాను" అని చెప్పి ఈ సాయంకాలం నాతో రా! చెప్పినట్లు చేయి అని కృష్ణుడు అనగా అప్పుడు ద్రౌపది 'కృష్ణా ! ఏనాడైనా నీ ఆజ్ఞను ఉల్లంఘించానా ! నీ ఆజ్ఞ నాకు ప్రాణసమానము' అన్నది. ఆనాడు రాత్రి 9 గంటలైంది. అందరూ నిద్రిస్తున్నారు. చిత్తశుద్ధి కలిగినటువంటి భీష్ముడు తాను చేసిన ప్రతిజ్ఞను ఏ విధంగా సాధించాలా ! అని ఆలోచిస్తున్నాడు, నిద్ర పట్టడం లేదు. అటూ ఇటూ తిరుగుతున్నాడు ఆ రోజులలో రాజపుత్ర స్త్రీలు చెప్పులు (పాదుకలు) ధరించేవారు. నడుస్తుంటే శబ్దం వస్తుండేది అప్పుడు కృష్ణుడు ద్రౌపదిని చూచి పాదుకలు వదలివేయమని చెప్పాడు, పాదుకలను వదలివేసింది రాచరికపు స్త్రీ కాబట్టితలమీద చీరెతో కప్పుకున్నది. అప్పుడు కృష్ణుడు 'వెళ్ళు ! భీష్ముని పాదాలపై పడు !' అని చెప్పాడు తక్షణమే పరుగెత్తుకుంటూ వెళ్ళి భీష్ముని పాదాలపై పడింది ద్రౌపది పాదాలు స్పృశించేటప్పుడు గాజుల శబ్దం విని స్త్రీయే అని భావించి వెంటనే భీష్ముడు "దీర్ఘసుమంగళీభవ !" అన్నాడు లేచింది, 'పితామహా ! నేను ఆశించింది ఇదే!' అన్నది ద్రౌపది. తమరు అనుగ్రహించినందులకు నేను ధన్యురాలనయినా నన్నది ద్రౌపది. ఇంతలో లీలామానుష విగ్రహుడైన కృష్ణుడు ప్రవేశించాడు. చూచాడు భీష్ముడు "కృష్ణా, ఇదంతా నీ నాటకమే. పాపం ! ద్రౌపదికి ఏమి తెలుసు ఈ యుక్తి ?" అన్నాడు. 'నేను చేసిన ప్రతిజ్ఞలు రెండూ రెండే ఒకటి పాండవులను హతమార్చడం! రెండవది 'దీర్ఘసుమంగళీభవ' అని ద్రౌపదికి యిచ్చిన దీవెన, ఈ రెంటిలో దేనిని వదలాలి ? దేనిని అమలు చేయాలి ?' అని కృష్ణుని అడిగాడు భీష్ముడు అప్పుడు కృష్ణుడు "ధర్మో రక్షతి రక్షితః నీవు విచారించనవసరం లేదు భీష్మా ! ఈ రెంటినీ ధర్మమే రక్షిస్తుంది" అన్నాడు అయితే ఇచ్చిన మాట ప్రకారం ఆఖరి వరకు తన శక్తివంచన లేకుండా పోరాడాడు భీష్ముడు .కట్టకడపటికి నేలకూలాడు, పాండవులు బ్రతికారు ద్రౌపది ఈ విజయాన్ని సాధించడానికి గల కారణమేమిటి ? మొదటిది కృష్ణుని పాదములపైబడి ప్రార్థించడం, రెండవది భీష్ముని పాదములపైబడి ప్రార్థించడం ఈ పాదముల యొక్క ప్రభావమే ఈ విజయానికి కారణభూతమైంది.

ఒక పర్యాయం గోపికలందరూ యశోద వద్దకువెళ్ళి కృష్ణుడు పాలకుండలను పగలకొడుతున్నాడని, వెన్నముద్దలు మ్రింగుతున్నాడని తమ గోడును యశోదతో చెప్పుకున్నారు. కాని యశోద అంగీకరించక, తినటానికి కావలసినంత వెన్న, త్రాగటానికి పాలు తన ఇంటిలోనే పుష్కలంగా వుండగా, ఇతరుల ఇండ్లలో దొంగిలించాల్సిన అవసరం కృష్ణునికి లేదని చెప్పింది. అయినప్పటికి కృష్ణుని దండించి వదలిపెట్టింది. ఒక పర్యాయం దీని అంతరార్థమును గోపికలకు బోధించాలనే నిమిత్తమై ఒక పర్యాయం ఒక గోపిక ఇంటికి కృష్ణుడు వెళ్ళాడు.

గోపికలచేత చిక్కి, తల్లిచేత ఈ సత్యమును గుర్తింప జేయాలని నిశ్చయించుకున్నాడు. ఒక గోపిక ఇంట్లోని పాలను క్రిందపోశాడు. ఆ పాలలో తన పాదములను తడుపుకున్నాడు గోపికలు పట్టుకోవటానికి వచ్చే టప్పటికి, పాలతో తడిపిన పాదములతో పరుగెత్తాడు గోపికలు వచ్చి చూచారు కృష్ణుడు కనిపించలేదు. కాని పాదముల ముద్రల నాధారము చేసుకొని వెళ్ళారు. కృష్ణుని పట్టుకున్నారు. అప్పుడు కృష్ణుని పట్టటానికి ఈ పాదముల ముద్రలే మూలకారణములైనాయి భగవదానుగ్రహమునకు పాత్రులం కావాలనుకుంటే, భగవంతుని స్వాధీనం చేసుకోవాలనుకుంటే, ఆయన పాదములను ఆశ్రయించవలసినదే. ఈ పాదముల యందున్న పవిత్రత, దివ్యశక్తి అనుభవజ్ఞులకు మాత్రమే అర్థమవుతుంది కాని కేవలం శ్రవణం చేసిన వారికి అర్థం కాదు, ప్రతి ఒక్కటి మనకు అనుభూతిలోనికి రావాలి నిత్య సత్య నిర్మలమైనటువంటి దివ్యత్వాన్ని గుర్తించాలనుకుంటే సత్యమైనటువంటి మార్గాన్ని మనం అనుసరించాలి, సత్యమే భగవత్ స్వరూపము సత్యస్వరూపుడు భగవంతుడు ఈ సత్యమును మార్చుటకు ఎవరికీ వీలు కాదు. సత్యాన్ని అనుసరించినప్పుడు మానవత్వం దివ్యత్వంగా మారిపోయింది అయితే ఈనాటి మానవత్వంలో సత్యం కొంతవరకు అగోచరం కావటం చేతనే, అసత్యమునే సత్యముగా విశ్వసించి, మానవత్వంలో వుండినటువంటి పశుత్వాన్ని మనం ప్రబలం చేసుకుంటున్నాం

ఆధ్యాత్మికం .... ఆధ్యాత్మికం అంటే ఏమిటి ? యాత్రలు పోవటమా ? వ్రతములు చేయటమా ? కాదు కాదు .... మానవునియందు శేషించి వున్నటువంటి పశుత్వాన్ని దూరం చేసుకోవటమే ఆధ్యాత్మికము పశుత్వాన్ని నిర్మూలనం గావించి, మానవత్వాన్ని అభివృద్ధిపరచుకొని, దివ్యత్వాన్ని పోషించుకోవటమే నిజమైన ఆధ్యాత్మికము కనుక దేహాన్ని అనుసరించడమే పశుత్వం, మనసుని అనుసరించడం కేవలం రాక్షసత్వం, ఆత్మను అనుసరించడమే దైవత్వం. ఎవరికి వారు ఈ మూడింటిలో దేనిని అనుసరిస్తున్నామో పరిశీలనచేసుకోవాలి

అసలు ఆత్మతత్త్వమంటే ఏమిటి? కంటిలో చూపు ఏ విధంగా వుంటున్నదో, చెవులో శబ్దం ఏ రీతిగా ఉంటున్నదో, మనసులో చైతన్యం ఆ రీతిగా వుంటుండాలి ఈ కంటిచూపుకు, చెవి శ్రవణమునకు, మనసు యొక్క చైతన్యమునకు వుండినటువంటి సన్నిహిత సంబంధమే ఆత్మతత్త్వము.

అలనాడు రాముడు అరణ్యవాసం చేస్తున్నప్పుడు భరతుడు పట్టాభిషిక్తుడై దేశమును పాలించలేదు రామ పాదుకలకు పట్టాభిషేకం చేసి, రామ ప్రతినిధిగా మాత్రమే భరతుడు పరిపాలన చేశాడు రామపాదుకలే భారతదేశాన్ని ఏలుతూవచ్చాయి ఈ పాదములలో ఎన్నో విధములైన శక్తిసామర్థ్యములు యిమిడిఉన్నాయి, మన ప్రపంచంలో జీవించడానికి ప్రధానమైన ఆధారము మన పాదమే. మన శరీరమంతా పాదములపైననే ఆధారపడి ఉంటున్నది. మన నిజజీవితం లోపల నైతిక జీవితాన్ని, భౌతికజీవితాన్ని, ఆధ్యాత్మిక జీవితాన్ని గడపటానికి ఈ పాదములే ప్రధానమైన ప్రమాణము. కనుకనే వేదమంత్రములలో కూడా "బ్రాహ్మణస్య ముఖమాసీత్, బాహో రాజన్య కృతః" అంటూ ఈ దేహములో నున్నటువంటి ఒక్కొక్క అంగమును కూడనూ ఒక్కొక్క విధమైన మతముగా నిరూపిస్తూవచ్చింది. పంచభూతములు, పంచేంద్రియములు, పంచస్పర్శలు ముఖమునందు మాత్రమునే ఉంటున్నాయి. కనుకనే ఈ శబ్ద స్పర్శ రూప రస గంధాదులతో కూడినటువంటిదే ఈ ముఖము ఒక దివ్యత్వమైన భాగము ముఖమునందు మాత్ర మేఇమిడి వుండటంచేత దీనికి 'బ్రాహ్మణ' అని పేరు పెట్టారు. ఇటువంటి దేహమును రక్షించే బాధ్యత బాహువులమీద

( తరువాయి 30 వ పేజీలో )

# జాంబియా దేశంలో శ్రీ సత్యసాయి పాఠశాల

——————ఎన్. బి. ఎస్. రామారావు

ఆఫ్రికా ఖండంలోని పేద విద్యార్థులకు మానవతా విలువలతో కూడిన (సత్య, ధర్మ, శాంతి, ప్రేమలతో కూడిన) ఉచిత విద్యావిధానమును అందచేస్తూ, సత్యసాయి శకమునకు ఖాపిపౌపలను తీర్చిదిద్దుతూ, ఆదర్శ జీవన విధానమును అచటి ప్రజలకు అందజేయుటయే లక్ష్యముగా గల్గి ఈ "సత్యసాయి పాఠశాల" స్థాపించబడి, అచటి సాయి భక్తుల సేవా సహకారముల ద్వారా, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి సంకల్ప అనుగ్రహముల ద్వారా ఈ పాఠశాల అభివృద్ధి గావింపబడుచున్నది

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఈ పాఠశాల స్థాపనలో శ్రీ విక్టర్ కానూ (Victor Kanu) గారిని ఒక పనిముట్టుగా ఎన్నుకొన్నారు శ్రీ కానూ కొంతకాలం ఆఫ్రికాలోని 'సియర్రాలియోను' లో కొంతకాలం బ్రిటీషు డైమండ్ కంపెనీలో పనిచేసి తరువాత యు కె నార్వే, స్వీడన్ దేశాలకు హై కమీషనరుగా పనిచేసారు. ప్రస్తుతం అనేక పాశ్చాత్య దేశాలకు మానవతా విలువలపై శ్రీ సత్యసాయి విద్యావిధానంపై కో-ఆర్డినేటరుగా ఉన్నారు.

మనకీ వ్యాసంలో స్వామి సంకల్పం నెమ్మనెమ్మదిగా ఎలా రూపు దాలుస్తుందీ, (Slow and steady wins the race) మనుష్యుల మనస్సులను నొప్పించకుండా ఎలా సాయిబాబావారు తీర్చిదిద్దుతారు, ఎవరినీ నొప్పించకుండా స్వామి ఎవరెవరికి ఎలా కనువిప్పు కలిగిస్తారు, అన్న విషయాలు విశదమౌతాయి. స్వామి యొక్క సర్వజ్ఞత గోచరిస్తుంది. నవసమాజ నిర్మాణానికి సాయి సంకల్పసిద్ధి ఎలా పనిచేస్తోందో విశదమౌతుంది.

ఒకసారి విక్టర్ కానూగారు స్వామి దగ్గర ఇంటర్వ్యూ పొందినపుడు, ఆఫ్రికా ప్రజలనుద్ధరించడానికి, మానవతా విలువలతో కూడిన సత్యసాయి విద్యావిధాన మొక్కటే మార్గమని, "నొడోలా" లోని 'జాంబియా' వద్ద శ్రీ సత్యసాయి పాఠశాల స్థాపించాలనీ సంకల్పాన్ని కానూగారు వ్యక్తపరచడం, దానిని స్వామి ఆశీర్వదించడం జరిగింది. ఆఫ్రికాకు వెళ్ళగానే కానూగారు స్వామి ఆదేశాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నం సాగించారు. జాంబియా మెట్రోపాలిటన్ మేయరుని కలిసికొని పాఠశాల స్థాపనకై కొంత భూమిని కేటాయించి ఇవ్వవలసిందిగా అర్థించారు మేయరు క్రిస్టియన్, మీరీ పాఠశాలలో ఏవిద్య బోధిస్తారు ? అని ఆయన ప్రశ్నించారు. అవతార పురుషులైన జీసస్ క్రీస్ట్ : శ్రీ సత్యసాయిబాబా మొ॥ ప్రముఖుల బోధనల సారాంశమైన "మానవతా విలువలు" 'ఆదర్శ జీవన విధానము' ముఖ్యాంశములుగా ఉంటాయని కానూగారు తెలియపరిచారు క్రిష్టియన్ విద్యావిధానము కాదనే భావంతో మేయర్ భూమి కేటాయింపుకు త్రోసిపుచ్చబోతూండగా, కానూగారు మనసులో బాబాగారిని ఒప్పించడం జరిగింది సరే పాఠశాలకై భూమి కేటాయింపుకు మేయరు ఒప్పుకొన్నారు. ఒప్పుకొని, ఎన్ని గ్రౌండ్స్ కావాలి ? How many grounds you want for the school ? అని కానూగారిని అడిగారు ? అంటే ఎన్ని ఎకరాలు కావాలి అని ? నాకు తెలియదు ; నా దేవుడినడిగి చెబుతానన్నాడు కానూ "నీ దేవుడి నడుగుతావా ? ఇది చాలా ఆశ్చర్యంగా వుందే ?" అన్నారు మేయరు. నిజానికి ఆ క్షణంలో ఎన్ని ఎకరాలు అడగాలో విక్టర్ కానూగారికి తెలియలేదు.

ఇంటికి వెళ్ళి పూజా గదిలో కూర్చుని స్వామిని ప్రార్థించాలి. స్వామి ఏదో విధంగా వారికి జవాబు ఇవ్వాలి. సత్యసాయిబాబాగారి పేరు చెబితే క్రిష్టియన్ మేయరు ఒప్పుకోరేమోనని విక్టర్‌కానూ, "నా దేవుడి నడిగి చెబుతాను", అని తప్పించుకొని, మరునాడు వస్తానని చెప్పి మేయరు దగ్గర సెలవు తీసికొన్నాడు

ఆ సమయంలో విక్టర్‌కానుగారి భార్య 'జెనోలీవా' (MA., Dip in Ed) ఇంకా పుట్టపర్తిలోనే స్వామి దగ్గరే ఉన్నది. భర్తతోపాటు ఆమె ఆఫ్రికా వెళ్ళలేదు జాంబియాలో విక్టర్ స్వామిని 'ఎన్ని ఎకరాలు అడగాలి'? అని ప్రార్థించాడు ధ్యానంలో. స్వామి దర్శనం లైన్లలో జెనోలివాకాను దగ్గరకు వచ్చి, 'Tell Kanu – Thirteen' అన్నారు. ఆమెకు స్కూలు భూమి మొ॥ ఈ విషయాలు ఏమీ తెలియవు ఏమిటి స్వామీ ? అని మళ్ళీ అడిగింది స్వామి 'Tell Kanu Thirteen' అని వెళ్ళిపోయారు ఆమె ఆయోమయంలో పడి, ఏమైతేనేమి అని, జాంబియా భర్తకు ఫోన్ చేసి Tell Kanu – Thirteen ' అన్నారు స్వామి అని చెప్పింది. ఏమిటి 13 ? కానూకు కూడా అర్థంకాలేదు. సరే స్వామిని తలచుకొని మరునాడు కానూ వెళ్ళి మేయరుని కలిసి ' స్కూలుకు 13 grounds కావాలి !' అన్నాడు. సరే మేయరుగారు Land Revenue Record చూసి సిటీకు దూరంగా గ్రామీణ ప్రాంతంలో, పేదవారి ఇళ్ళ ప్రాంతంలో ఒకచోట గల 13 ఎకరాల నేల స్కూలుకి కేటాయించి ఇచ్చారు. విక్టర్ కానూకు ఈ స్కూలు సిటీ మధ్యలో ఉండాలనే కోరిక గాఢంగా ఉన్నా, సిటీ మధ్యలో అంత స్థలం లేనందువలన, ఇచ్చిన స్థలం అయిష్టంగా తీసుకోక తప్పిందికాదు.

ఆ స్థలంలో 'బోర్‌వెల్స్' వేయించి భూగర్భజలం మోటారులతో తీసి పాఠశాల భవనం కట్టుబడి ప్రారంభించాలని సంకల్పించాడు విక్టర్ కానూ. ఆఫ్రికాలో డ్రిల్లింగ్ రిగ్స్; భూగర్భజల పరిశోధకులు అంతాచేసేది తెల్లవారు మాత్రమే. వారికి ఆఫ్రికా ప్రజలంటే అంత ఇష్టం ఉండేదికాదు. కానీ ఆఫ్రికా ప్రజల అభివృద్ధే ప్రధానం విక్టర్ కానూకి భూగర్భజల పరిశోధకుడు ఎక్కడ నీరు పడుతుందో చెప్పమంటే 13 ఎకరాల నేలంతా పరిశోధించడం చాలా కష్టమనీ, అందుకు చాలా ఎక్కువ ధనం డిమాండు చేస్తూ ఎట్టకేలకు మూడు పాయింట్లు పరిశోధించి, భూమిలో ఎక్కువ నీరు లేదనీ, ఈ మూడు పాయింట్లలోనూ కూడా నీరు చాలా తక్కువగా పడే అవకాశం మాత్రమే ఉన్నదనిచెప్పాడు తన డ్రిల్లు మెషిన్లు దూరంగా ఎక్కడో పనిచేస్తున్నాయనీ అవి అచటికి వచ్చి డ్రిల్లింగు చెయ్యాలంటే చాలా ఎక్కువ ధనం కావాలనీ డిమాండు చేసాడు. కానూ పట్టు విడువక అలాగే ఒప్పుకొని ఒక పాయింటు డ్రిల్లు రెండు మూడు పాయింట్లు డ్రిల్లు చేయించాడు. ప్రతీ పాయింటూ కూడా ఒక్కొక్కటి 60 మీటర్లు లోతు డ్రిల్లు చేసారు. కానీ ఏ ఒక్క పాయింటులోనూ నీరు పడ లేదు. డబ్బు వృథా అయ్యింది. కానూ నీరసంగా బయలుదేరి పుట్టపర్తి చేరాడు.

స్వామి కానూని ఇంటర్వ్యూకి పిలిచారు. స్వామి సర్వజ్ఞుడు కానూ మనసులో ఏమి వున్నదీ స్వామికి తెలుసు ధనవంతులకు, సిటీ మధ్యలో స్కూలు స్థాపించడం మన ధ్యేయం కాదు. ధనం లేని పేదవారికే ఉచిత విద్యా విధానం కావాలి అటువంటి ప్రజలు నివసించే ప్రాంతంలోనే స్కూలు ఉండాలి. కనుక ప్రస్తుతం భూమి సరైన చోటనే దొరికింది. నీరు లేదని బాధపడకు కానూ, మరో 5 మీటర్లు లోతు డ్రిల్లుచెయ్యి. అదే బోరులో నేను ' గంగను ' విడిచిపెడతాను అని ఆశీర్వదించారు సాయీశ్వరులు కానూ సంతోషంతో తిరిగి వెళ్ళి మళ్ళీ డ్రిల్లింగుకోసం వైట్‌ను సంప్రదించాడు ఆయన ఆ బోరులో తిరిగి డ్రిల్లు చెయ్యడమా ? మరో 5 మీటర్లలో నీరు పడుతుందని 'నీ దేవుడు చెప్పాడా'? ఏమీ లాభంలేదు. ఎంత లోతు వెళ్ళినా అక్కడ చుక్క నీరు రాదు నువ్వు ఎంత డబ్బు ఇచ్చినా నేను మిషన్ తీసుకొని వచ్చి డ్రిల్లు చెయ్యడం

ఇపుడు కుదరదు అన్నాడు. కార్యసాధకులకు ఎంత నిగ్రహం కావాలో ఎన్ని కష్టాలో చూడండి. అందుకే భర్తృహరి చెప్పాడు, 'ఆరంభింపరు నీచ మానవులు... ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్' అన్న పద్యం మనం ఇక్కడ జ్ఞాపకం చేసికోవాలి పట్టు విడువని విక్రమార్కుడిలా శ్రీ కానూ ఆ 'వైట్' కి చెప్పి చెప్పి ఎట్టకేలకు డ్రిల్లు మిషన్ తీసికొనివచ్చి డ్రిల్లు చేయించాడు. మొదట డ్రిల్లు చేసిన బోరువెల్ మరో 5 మీటర్లు డ్రిల్లు చేసేసరికి పాతాళగంగ ఏనుగు తొండం లావున పొంగిపొర్లింది. వైట్ ఆశ్చర్యపోయాడు రెండవ పాయింటు, మూడవ పాయింట్ కూడా ఉచితంగా డ్రిల్లు చేశాడు వైట్. అచట కూడా బ్రహ్మాండమైన జల, దాంతో భూగర్భజల పరిశోధకుడిని పిలిచాడు ఆ భూమిలో నీరు లేదని చెప్పిన పరిశోధకుడు అడుగున ఇపుడు నది ప్రవహిస్తోందని చెప్పాడు ఒక బోరువెల్ చాలునని తీర్మానించి మిగతా రెండు వెల్సుప్లగ్ చేసి వేశారు ఇపుడు ఆ ఒక బోర్ వెల్ నీరే వారికి ఎక్కువై పోయింది కానీ భవన నిర్మాణానికి అవసరమైన ధనం చేకూరలేదు ఆ ప్రాంతంలోని ప్రజలలో ఈ విద్యా విధానంపై అనేక అనుమానాలు వారిలో వారికి అసూయ కొంతమంది సాయిభక్తులే తమ తోటివారిని ధనసహాయం చేయవద్దని ప్రేరణ ఇచ్చారు కాయలు కాసే చెట్టు పైననే ప్రజలు రాళ్ళు రువ్వుతారు ఈ పరిస్థితిలో సతమతమవుతున్న కానూ తిరిగి పుట్టపర్తి చేరాడు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సర్వజ్ఞులు. ఎవరి అహం ఎలా తగ్గించాలో ఎవరి మనస్సులు ఎలా మార్చాలో వారికి బాగా తెలుసు కానూని ఇంటార్వ్యూకి పిలిచారు. కానూ, స్వామితో, "స్వామి నా స్కూలుకి తగిన నిధులు రావడంలేదు భవంతులు లేవు" అన్నాడు. స్వామి, ఏమన్నావు? మళ్ళీ అదే అను! అన్నారు. అతను మళ్ళీ అదే మాట అంటూ "నా స్కూలు" అన్న పదం తప్పని గ్రహించి, స్వామీ పొరబాటు; మీ స్కూలుకి నిధులు రావడం లేదు అన్నాడు వెంటనే స్వామి చిరునవ్వు నవ్వుతూ, అవును 'నీ స్కూలు' అనుకొంటే నువ్వే నిధులు ఏర్పరచుకోవాలి ఇపుడు నువ్వు 'నా స్కూలు' అన్నావు కనుక అంతా నేనే చూసుకొంటా వెళ్ళిరా! అన్నారు ఆనందంగా ఆఫ్రికా చేరాడు కానూ. అనుకోని వారందరూ ఎదురై అనూహ్యమైనంత ధనం వచ్చి చేరింది, ఆశ్చర్యపోయాడు కానూ.

1990 వ సం॥ జూన్ 10 వ తేదీన బాబావారి సంకల్ప దీవెనలతో పాఠశాల భవన నిర్మాణం ప్రారంభమైంది. 1991 సం॥ డిశంబరు నెలలో పూర్తి అయింది (ఈ పాఠశాల నిర్మాణం జరుగుతుండగా రాత్రిళ్ళు దొంగలు ఇనుము, సిమెంటు మొ॥ ఎత్తుకుపోతూంటే సెక్యూరిటీ గార్డు దొంగలు తన పైకి ఉసికొల్పిన వేట కుక్కలను తరిమికొట్టడానికి, తుపాకి గుళ్ళు కావాలని విక్టర్ కానూను అడగడం, కానూగారు తుపాకి గుళ్ళకు బదులు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి చిన్నచిన్న ఫొటోలు రెండు ఇవ్వడం ఆ ఫొటోలు చూసిన జాగిలాలు సెక్యూరిటీ గార్డుని ప్రేమించి తమ యజమానులనే తరిమికొట్టడం— ఆ సంఘటన వివరాలు చదువరులు ఇదివరకు నేను వ్రాసిన ఒక వ్యాసంలో శ్రీవాణిలో చదివియేయున్నారు. ఆఫ్రికాలోని జాగిలాలు ఇండియా ప్రజలను, తెల్లవారినీ మొరగవట. నీగ్రోల పైననే విరచుకొని పడతాయట. అది వాటి లక్షణమని స్వభావమని వివరించారు శ్రీకానూ).

ఈ పాఠశాల 1 వ తరగతి నుంచి 12 వ తరగతి వరకూ విద్యాబోధనకు వీలుగా 14 క్లాసు రూముల తోనూ, స్టాపు రూము, లైబ్రరీ, ప్రార్థనా హాలులు కల్గి ప్రైమరీ విభాగము, సెకండరీ విభాగములో 10 క్లాసు రూములు, 2 పెంటీరూమ్సు, 2 పెద్దసైన్సు లేబరేటరీలు, ప్రార్థనా హాలు, మరియూ 2 వేలమంది విద్యార్థులు కూర్చునేందుకు తగిన ఆడిటోరియము నిర్మింపబడ్డాయి. విద్యార్థుల ఆరోగ్య రక్షణకు ఈ పాఠశాలలో చాలా ప్రాముఖ్యత నొసగబడినది. 51 ఆధునిక లెట్రిన్లు, 40 వాష్ బేసిన్లు, 65 మీ॥ లోతైన బోరువెల్సు,

## అభయ ప్రదాత

పిలిచినంతనె మారు పలికెడు దైవంబు
కలడోయి సోదరా కదలి రమ్మ !
తలచినంతనె వేగ దరిచేరు దైవంబు
కలడమ్మ సోదరి కనుము నిజము !
కొలచినంతనె లేమి తొలగించు దైవము
కలడుళే మిత్రమా కలతపడకు !
శరణన్న తోడనే కరుణించు దైవంబు
కలడయ్య బాబయ్య కాంచరమ్మ !

కులము చూడబోడు - కలిమికి చిక్కడు
మడులు మాన్యములకు మనసు పడడు
'భక్తి-నిష్ట' జూచి 'బంగారు' రమ్మని
అభయ మొసగు 'సాయి' దైవమతడు

- ఏకా రామచంద్రరావు

విద్యుద్దీకరణ అంతా 13.85 ఎకరాల విస్తీర్ణమైన స్థలంలో మంచి ప్లే గ్రౌండుతోసహా ఏర్పాటుచేయబడ్డాయి. ఆడిటోరియంలో సాంస్కృతిక కార్యక్రమాలు, మానవతా విలువలపై సదస్సులు, ప్రపంచ ముఖ్య మతముల తాలూకు పండుగ ఉత్సవములు వగైరాలు జరుగుతుంటాయి. ప్రిన్సిపాల్, స్టాపునకు ప్రత్యేక మైన ఎడ్మినిస్ట్రేషను బిల్డింగు ఏర్పాటుచేయబడినది వారివారి విషయ బోధనలలో చాలా ప్రత్యేకతగల నిపుణులు అధ్యాపకులుగా ఏర్పాటుచేయబడ్డారు Ministers of Education ; Republic of Zambia వారిచే ఈ స్కూలు గుర్తింపబడి నడుపబడుతోంది. ఇది ముఖ్యంగా Non profit making educational Institute గా నడపబడుతోంది.

ఈ స్కూలు యొక్క ముఖ్యోద్దేశం : 1) బాబావారి ప్రేమ అందరికీ పంచుట 2) జాంబియా దేశాన్ని ఆదర్శ విద్యార్థులతో తీర్చిదిద్దుట 3) ఆఫ్రికా ఖండానికే ఈ స్కూలు ఒక ఆదర్శ మోడలుగా చూపించుట S S L C. వరకూ 12 తరగతులు ఇందులో బోధింప బడుతూ ప్రైమరీ విభాగంలో శ్రీ సత్యసాయిబాబావారి జీవిత ఆదర్శములనూ, మానవతా విలువలను జోడించి బోధించుట ముఖ్య సూత్రములుగా గైకొనబడినవి. అంతా ఉచిత విద్యావిధానమే ఏ విద్యార్థికీ ట్యూషన్ ఫీజు లేదు.

ఒకసారి జపానుదేశపు శ్రీ సత్యసాయి సంస్థల ప్రెసిడెంటు శ్రీ హీరాగారు శ్రీ విక్టర్ కానూగారిని జపాను వచ్చి మానవతా విలువల సదస్సులో మాట్లాడవలసినది, విమానపు ఖర్చులు జపానువారిచ్చు కుంటామని అంటే అపుడు విక్టరుగారిలా అన్నారు. నేను ఆ సదస్సులో మాట్లాడవలసిన విషయం అంతా కాగితంపై వ్రాసి పంపుతాను నాకు మీరివ్వదలచిన విమానపు ఖర్చులు - ఆ ధనం మొత్తం మా స్కూలుకి విరాళంగా పంపితే ఆ ధనంతో ఒక బస్సు కొనవచ్చు ఈ స్కూలులో చదివే పేద విద్యార్థులు సుమారు 10 మైళ్ళు రోజూ నడిచి వచ్చి నడిచి వెళ్ళుచున్నారు' అలాంటి వారికి ఆ బస్సు సౌకర్యం చేకూర్చగలదు. అని వ్రాశారు. దానిని బట్టి విక్టర్‌కానూగారిక ఆ స్కూలుపై గల శ్రద్ధ, పట్టుదల కార్యసాధనా దీక్ష మనకు బోధపడగలవు ఇపుడు వారికొబస్సు కూడా లభించినది.

ఈ స్కూలు ఇలా నడుస్తోండగా ఒకసారి మానవతా విలువలపై పుట్టపర్తిలో పూర్ణచంద్ర ఆడిటోరియంలో 18 దేశాల సమావేశం జరిగింది. ఆ సభకు 18 ప్రపంచ దేశాల ప్రముఖ సత్యసాయిసంస్థల E H V కోఆర్డినేటర్లు హాజరయ్యారు. శ్రీ అర్జాంగ్‌జామ్ సాయి అనేక తూర్పు

పాశ్చాత్య దేశాలకు కో ఆర్డినేటరుగా ఉన్నారు. సభలు జరుగుతున్నాయి. స్వామి వేదికపైన ఆసీనులై యుండగా, శ్రీ అర్తాంగ్ జుమ్ సాయి మాట్లాడుతూ, ఇంత వరకూ శ్రీ సత్యసాయి బాబావారిచే ఆమోదింపబడి, గుర్తింపబడి, సత్యసాయి విద్యా విధానమును అమలు పరుస్తున్న పాఠశాల మా 'థాయ్‌లాండ్' లో గల ఒక్క స్కూలు మాత్రమే అని నొక్కి వక్కాణించారు. అర్తాంగ్ జుమ్ సాయిగారి ఉపన్యాసం అనంతరం స్వామి మాట్లాడారు. కానీ స్వామి ఈ స్కూలు విషయమే ప్రస్తావించలేదు. ఆరోజు ఈ 18 దేశాల ప్రముఖులలోనూ అర్తాంగ్ జుమ్ సాయి- 'జాంబియా స్కూలు' ను గురించి ప్రస్తావనే లేకపోవటం అందరిలోనూ కలవరం కల్గించింది. రాత్రిపూట కొందరు మిత్రులు వచ్చి కానూ గారితో ఈ విషయం ప్రస్తావించగా, కానూగారు 'అంతా స్వామికి తెలుసు మనం నిమిత్తమాత్రులం ఏమో జాంబియా పాఠశాల బహుశా స్వామిచే గుర్తింపబడలేదేమో ! ఈ విషయంపై మాట్లాడే అర్హత మనకు లేదు' అని వారు తమ మిత్రులకో అనేసరికి, వారి మిత్రులు మారు మాట్లాడకుండా వెళ్ళిపోయారు.

ఆ మరునాడుదయం ఈ 18 దేశాల ప్రముఖులు స్వామి దర్శనార్థం ప్రశాంతిమందిరం వరండాలో కూర్చున్నారు స్వామి దర్శనం ఇస్తూ 'కానూగారిని లేచి ముందుకు రమ్మని చేతితో సంజ్ఞ చేశారు. విక్టర్ కానూగారు వెనక వరుసనుండి లేచి ముందుకు వచ్చారు. స్వామి దగ్గర వంగి చేతులు జోడించారు స్వామి వారితో నీపేరేమిటి? అని అడిగారు 'విక్టర్ కానూ' అన్నాడాయన. నువ్వేమి చేస్తుంటావు ? అని స్వామి గట్టిగా అడిగారు. 'జాంబియాలో శ్రీ సత్యసాయి పాఠశాల' నడుపుతుంటాను. ఏమి పాఠశాల ? అని గద్దించి అడిగారు స్వామి. 'శ్రీ సత్యసాయి పాఠశాల ' అని గట్టిగా చెప్పాడు కానూ. సంతోషం అని శ్రీ అర్తాంగ్ జుమ్‌సాయి కేసి చూశారు స్వామి అంతే అక్కడితో స్వామి

# మన సాయి

ఏనాటి రాముడో ! ఈనాడు సాయియై !
ఇచ్ఛతో ఏలగ ! ఇలకు వచ్చె !
ఏనాటి కృష్ణుడో ! ఈ సాయి కృష్ణుడై !
పుట్టపర్తిని పుట్టె ! పుణ్య మలర !
ఏ మూల శక్తియో ! ఈ సాయి మాతయై !
బిడ్డల ప్రేమతో పిలువ వచ్చె !
ఏ సత్య తేజమో ! ఈ సత్య సాయియై
ఉర్విని కాపాడ ఉరికి వచ్చె !

ఇట్టి రాముని ! కృష్ణుని ! ఇట్టి శక్తి
తేజమును మఱువగరాదు ! తెలిసి మనము !
ఎన్ని జన్మల పుణ్యమో ! ఇపుడు పండి !
లభ్యమాయెను ! మన సాయి సభ్యులార !

- రాయవరపు రవి

కదిలిపోయి వరండా బయట ఉన్న భక్తులకు దర్శనం ఇవ్వడానికి వెళ్ళిపోయారు. ఈ సన్నివేశంలో అర్తాంగ్ జుమ్‌సాయిగారి మనస్సుని స్వామి ఏమీ నొప్పించక, కొట్టక, తిట్టక ఎలా మార్చారో చదువరులు గ్రహించియే వుంటారు.

భగవాన్ శ్రీ సత్య సాయి బాబావారి అనుమతితో, అనుగ్రహంతో బాబావారే ఆధారంగా ఈ వ్యాసం ప్రకటించడం జరిగింది.

)-○-(

# గతిని బట్టి మనుజుని మతియును నొప్పు

— కొమరగిరి కృష్ణమోహనరావు

" సత్యానుసారిణీ లక్ష్మీః
కీర్తిః త్యాగానుసారిణీ
అభ్యాసానుసరీ విద్యా
బుద్ధిః కర్మానుసారిణీ. "

లక్ష్మి సత్యమును అనుసరించియుండును. త్యాగము ననుసరించి కీర్తి యుండును విద్య అభ్యాసము ననుసరించి యుండును. బుద్ధి కర్మమును అనుసరించి యుండును. లేక కర్మ ననుసరించి బుద్ధి ఉండును. ఈ రెంటికీ అవినాభావ సంబంధము కలదు.

మన ఆహారాన్ని బట్టి మన ఆలోచనలు ఉంటాయి
మన ఆలోచనలబట్టి మన చేతలు ఉంటాయి.
మన చేతలబట్టి మన ఫలితాలు ఉంటాయి.
మన గతిని బట్టి మన మతి ఉంటుంది.
మన మతిని బట్టి మన స్థితి ఉంటుంది.

'యద్భావం తద్భవతి' అన్నారు గదా! మన మనస్సు పవిత్రంగా, నిర్మలంగా, విశాలభావంతో ఉంటే మన భావనలు సద్భావనలు అవుతాయి, మన ఆలోచనలు సదాలోచనలవుతాయి, సత్ఫలితాలను అందిస్తాయి. మనస్సు నిర్మలం, బుద్ధి నిశ్చలంగా ఉన్నప్పుడు, సరియైన, సముచితమైన నిర్ణయాలను గైకొనగలుగుతాం, సత్ఫలితాలను అందుకోగలుగుతాం. ఒకవేళ మన మనస్సు మలినమైతే మన భావాలు దుర్భావనలు అవుతాయి. మన ఆలోచనలు దురాలోచనలు అవుతాయి, దుష్ఫలితాలను అందిస్తాయి. కనుక సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్థి. 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అన్నారుగదా ! బంధమునకు మోక్షమునకు మన మనస్సే కారణం మంచిచెడ్డలకు, సుఖదుఃఖాలకు మూలం మన మనస్సే. సర్వసంకల్పాలకు మూలం మనస్సే.

"సత్య సంకల్పములచేత సాధువగును
దుష్ట సంకల్పములచేత దుష్టుడగును"

అన్నారు మన పెద్దలు. కనుక మన మనస్సు సత్య సంకల్పాలకు నిలయం కావాలి దుష్ట సంకల్పాలను దూరంగా ఉంచాలి దురాలోచనలకు తావివ్వరాదు. 'దూరాలోచనలు' చేయాలి' అప్పుడే మన గతి మన మతిని అనుసరిస్తుంది. లేకపోతే మన మతి మన గతిని అనుసరిస్తుంది.

అసలు మన మతి మన ప్రారబ్ధమును అనుసరించే ఉంటుంది మనకు ఎంత ప్రాప్తమో అంతే లభిస్తుంది గాని ప్రాప్తమునకు మించి ఏమాత్రం లభించదు. అసలు ఆ ప్రాప్తి లభించేంతవరకు మన మతి ప్రసరిస్తుంది అందువలననే 'బుద్ధిః కర్మానుసారిణీ' అన్నారు.

" చెంబు బావియందు, చెరువునందును కూడ
పట్టినంత నీరె పట్టనింపు
ప్రాప్తి ఎంతో అంతె ఫలము ఎందేగినా "

చెంబు తీసుకొని వెళ్ళి బావిలో ముంచినా, చెరువులో ముంచినా, నదిలో ముంచినా, దానిలో పట్టినంత నీరే వస్తుందిగాని ఎక్కువ రాదు. చెంబును చిన్న బావిలో ముంచితే తక్కువ జలం వస్తుందనిగాని, మహాసముద్రంలో ముంచితే ఎక్కువ జలం వస్తుందనిగాని ఆశించరాదు. ఆ చెంబులో పట్టినంత నీరే వస్తుంది.

అదే విధంగా మన అదృష్టమును బట్టే ఫలితముంటుంది. మరు భూమి వద్దకు వెళ్ళినా అంటేది అంటకమానదు, బంగారపు కొండవద్దకు వెళ్ళినా అంటనిది అంటదు. రావల్సింది రాకమానదు పోవల్సింది పోకమానదు. మనకు ప్రాప్తమెంతో అంతే లభిస్తుంది.

"వనజభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము
ఘనంబో కొంచెమో
విను మరుభూమికేసిన లభించును మేరువు
జేరంబోయినన్
ధనమధికంబురాదు కడు దైన్యంబు మాను
ధనాఢ్యులందు న
వ్వనని ధి నూతదుల్యముగ వారి గ్రహించు
ఘుటంబు సూడుమా"

అన్నాడు భర్తృహరి ఇది విస్మరించరాని యదార్థం, మరువలేని వాస్తవం.

(ఆకాశవాణి సౌజన్యంతో - 15-5-95)

రసవద్ఘట్టాలు - 18

# మానవ జన్మ గొప్పది

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

స్వామి వివేకానంద విదేశాల్లో భారత ఆధ్యాత్మిక శంఖారావం పూరించి మాతృదేశానికి తిరిగివచ్చారు. విదేశాల్లో బాగా డబ్బులు సేకరించి ఉంటారన్న నమ్మకంతో ఒక యువకుడు వివేకానందుల వద్దకు వచ్చాడు తాను పనిచేస్తున్న జీవకారుణ్య సంఘానికి విరాళం ఇవ్వమని విన్నవించుకున్నాడు

'విరాళాలెందుకోసం?' అని స్వామీజీ ప్రశ్నించారు.

'నేను జైనమతీయులు స్థాపించిన జీవకారుణ్య సంఘ కార్యకర్తను కసాయి కిరాతకుల కత్తుల బారినుండి గోవుల ప్రాణ రక్షణ మా సంస్థ లక్ష్యం. గోశాలల కోసం నిధులు సమకూర్చడం నా పవిత్రధర్మం ఆ సత్కార్యానికి నన్ను నేను అంకితం చేసుకున్నాను ' అన్నాడు యువకుడు ఎంతో నమ్రతతో.

'స్వామీజీ హిందువులందరికీ గోవు అత్యంత పూజనీయమైన ప్రాణి అన్న విషయం తమకు తెలియనిది కాదు, గోవుల రక్షణ దైవపూజతో సమానం. తాము దయచేసి, విరాళం ఇచ్చి నన్ను ఆశీర్వదింప వేడుతున్నాను' అన్నాడు.

వివేకానందులు చిరునవ్వుతో 'బాబూ మన దేశంలోని కొన్ని ప్రాంతాల్లో తీవ్రమైన కరువు వచ్చింది. ఆకలితో, రోగాలతో సామాన్య జనులు పురుగుల్లా చస్తున్నారు. అట్టి దీనులకు మీ సంస్థ ఏ విధంగా సహాయ పడుతుందో చెప్పు' అన్నారు

యువకుడు ఆ ప్రశ్న విని తబ్బిబ్బయ్యాడు. నోట మాట రాలేదు.

'స్వామీజీ, నన్ను క్షమించండి. గోరక్షణ మాత్రమే మా లక్ష్యం. కరువు కాటకాలకు గురయ్యే ప్రజలకు సహాయం చేయటం మా పని కాదు. అది వారి కర్మ ఫలం. దానికి వారు అనుభవించక తప్పదు'

వివేకానందులు ఉగ్రులయ్యారు.

'ప్రజల కష్టాలకు స్పందించని మీ సంస్థ, నిజంగా ఒక సంస్థేనా ? నేను అందుకు ఒక పైసా కూడా విరాళమివ్వను మానవ జన్మ అన్నింటికంటే గొప్పది' అన్నారు.

యువకుడు తెల్లమొహం వేశాడు - విదేశాల నుండి అపారంగా పైకం తెచ్చారని, పెద్ద మొత్తం అందగలదని స్వామీజీ వద్దకు వచ్చాడు. వివేకానందుల సమాధానం విని, నమస్కారం చేసి వెళ్ళిపోయాడు. ◯

# పశ్చాత్తాపం

-సోమంచి రామం

తప్పు చేయటం మానవ సహజం. తప్పు చేయుట తప్పు కాదు. చేసిన తప్పును తెలిసికొనకపోవటం తప్పు. తెలిసికొన్న తప్పును గురించి పరితపించక పోవడం తప్పు ! దానిని సరిదిద్దుకోకపోవడం తప్పు ! ఆ పరితాపమే పశ్చాత్తాపము చేసిన తప్పుకు శిక్షను అనుభవించక తప్పదు తాత్కాలికంగా తప్పించుకొన్నా, తప్పు చేశామన్న భావన మనిషి మనసును నిరంతరము వేధిస్తూనే ఉంటుంది. అట్టి అంతర్మధనమును మించిన శిక్ష లేదు.

బాల్యంలో ఒకసారి, పూజ్య బాపూజీ దొంగతనం చేస్తారు కాని వెంటనే అది పాపకార్యమని గ్రహిస్తారు తండ్రి దగ్గర తన తప్పిదాన్ని ఒప్పుకొని, యికపై చౌర్యానికి పాలుపడనని ప్రమాణం చేయాలని నిర్ణయిస్తారు. కాని తండ్రి యెదుట మాట్లాడే ధైర్యం చాలదు తండ్రి దండిస్తారన్న భయంకన్నా, తండ్రికి మానసిక క్షోభ కల్గుతుందన్న బాధ ఎక్కువవుతుంది అందుకని తప్పుకు తగిన శిక్ష విధించమని, తానిక తప్పు చేయనని చీటీపై వ్రాసి తండ్రికిస్తాడు దాన్ని చదువుకొన్న తండ్రి, కళ్ళవెంబడి కన్నీళ్లు బొటబొట రాలుస్తాడు - మౌనంగా రోదిస్తున్న తండ్రిని చూసి, బాపూజీ గుండె బ్రద్దలయిపోయింది. ఘోరునవిలపించాడు. ఆ కన్నీళ్ళే ఆయన హృదయాన్ని పరిశుద్ధం చేశాయి. అంతకన్న వేరు శిక్ష ఏముంది ?

పశ్చాత్తాపము నొందినవారు భగవానునికి అత్యంత ప్రేమపాత్రులు.

బైబిలులో ఒక చక్కని కథ ఉంది ! ఒక ఆసామికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు బుద్ధిమంతుడు. తండ్రి పట్ల గౌరవం కలవాడు. చిన్నవాడు పొగరుబోతు, తిరుగుబోతు స్నేహితుల దుర్బోధలు విని, ఆస్తిలో వాటా పంచమని, తండ్రిలో తగవులాడుతాడు తప్పని పరిస్థితుల్లో తండ్రి అతని భాగం అతనికిస్తాడు. స్నేహితులందరితో కలిసి, చేతికొచ్చిన సొమ్మంతా జల్సా చేసేస్తాడు. పైకం పల్చబడగానే, మిత్రులంతా పక్కకు తప్పుకున్నారు. అప్పుడు కళ్లుతెరిచాడాఅభాగ్యుడు. ఆకలి దహిస్తోంది తిండి దొరికే మార్గంలేక, పందుల కాపరిగ పనికి కుదురుతాడు ఆ నికృష్ట జీవనమునకు ఘోరున విలపిస్తాడు. తండ్రి తననెంత ముద్దుగ చూసిందీ తలచుకొని బావురుమంటాడు. తప్పు తెల్సుకొని, పశ్చాత్తాపముతో పరుగు పరుగున తండ్రిదగ్గర కెళ్లి, పాదాలపై పడతాడు దారి తప్పి తిరిగి వచ్చిన ఆ కొడుకును అక్కున చేర్చుకొని, ఆ తండ్రి ఆనందిస్తాడు పశ్చాత్తాపం అతని హృదయ కల్మషాన్ని కడిగివేసింది పాపము చేయనివారు భగవంతుని భక్తులు పాపమునుండి పశ్చాత్తాపంతో బైటపడ్డవారు భగవంతునికి ఇష్టులు.

ప్రవర్తనా పరివర్తనకు దారి చూపేదే పశ్చాత్తాపము విశ్వవిజేతకావాలన్నది అశోకుని ఆకాంక్ష. కాని కళింగ యుద్ధం అతని కళ్లు తెరిపిస్తుంది రక్తసిక్తమైపడిఉన్న సైనికుల ఆర్తనాదాలు, బంధుమిత్రుల రోదనలు అశోకుని మనసును కలచివేస్తాయి ! పశ్చాత్తాపముతో హృదయ పరివర్తన కలుగుతుంది. ఆత్మరక్షణకు, దేశరక్షణకు తప్ప, ఇక కత్తి నెత్తేదే లేదని శపథము చేస్తాడు. ప్రజా సంక్షేమంకోసం జీవితం ధరపోస్తాడు పశ్చాత్తాపము చెందిన మనిషి పరమాత్మునితో సమానము

శుక్రునివద్ద మృతసంజీవిని విద్య నేర్చుకొనిరమ్మని కచుని పంపిస్తారు దేవతలు. శిష్యునిగా చేరిన కచుడు సకల విద్యలు నేరుస్తాడు. రాక్షసులాతనిని రెండుమార్లు చంపగా, శుక్రుడు మృతసంజీవనితో బ్రతికిస్తాడు ఆఖరుగా కచుని చంపి, దహనంచేసి, ఆ బూడిదను మద్యంలో కలిపి శుక్రునిచేత త్రాగిస్తారు. మత్తు దిగిన పిమ్మట, జరిగిన తప్పుకు పశ్చాత్తాపము చెంది శుక్రుడు 'మద్యపానము పాపకార్యమని, దానిని నిషేధిస్తున్నానని' శపించి ప్రాయశ్చిత్తం చేసికొంటాడు. పశ్చాత్తాపమును మించిన ప్రాయశ్చిత్తము లేదు. 0o0

సైన్స్‌వాణి : 8

# తెనె ఈగ 'కవరాపిష్కు

.కె. ఆర్. కె. మోహన్

తేనె పేరు వింటేనే నోరూరుతుంది. సృష్టిలో తీయనైన పదార్థాలు ఎన్నో వున్నా తేనె రుచి సాటి దేనికీ రాదు. ఇందుకు కారణం వివిధ పుష్పముల నుంచి సేకరించిన మకరందం మిశితం కావడం కావచ్చు. తేనె మానవునికి ప్రకృతిమాత ప్రసాదించిన మధురాతి మధురమైన కానుక మామూలుగా మనం తేనెను ఆరోగ్యం ఇస్తుందన్న కారణంతోనూ, రుచిగా ఉంటుందనో, ఆపళంగానే ఆరగిస్తాం. లేదా ఆయుర్వేద యునాని ఔషధాలు సేవింపవలసివచ్చినపుడు వాటితో కలిపి తీసుకుంటాం అయితే తేనె ఇంకెన్ని విధాలుగానో ఉపయోగపడుతుందన్న విషయం చాలా మందికి తెలియదు. దీనిని మందులు, బేకరీ ఉత్పత్తులు వైన్‌లు, కాస్మెటిక్‌లు, మృదువైన పొగాకు తయారీ వంటి ఎన్నిటిలోనో వాడుతారు. తేనె పట్టు నుంచి వచ్చే మైనం వివిధ పరిశ్రమలలో ఉపయోగపడుతుంది. తేనేటీగలవల్ల మనకి తేనె, మైనం లభ్యం కావడమే కాదు అంతకన్న బృహత్తరమైన ఉపయోగమే ఉంది ప్రధానంగా వీటిమూలంగానే పంటచేలలోనూ, తోటలలోనూ ఉన్న చెట్ల పూవుల మధ్య పరపరాగ సంపర్కం సాధ్యపడుతుంది ఇందువల్ల ఆరోగ్య వంతమైన విత్తనాలు తయారై వాటినుంచి శ్రేష్ఠమైన మొక్కలు వస్తాయి.

## ఆధునిక పరిశ్రమ :

తేనేటీగలు పౌర్ణమినాటికి పట్టును తేనెతో నింపుతాయనీ ఆ విధంగా నిలువచేసిన తేనెను అమావాస్య వచ్చే సరికి పూర్తిగా ఖర్చుచేసి అమావాస్య వెళ్ళిపోగానే తిరిగి నింపడం మొదలుపెడతాయనీ నమ్మకం అందువల్ల గిరిజనులు పౌర్ణమినాడు తేనెపట్టులకు పొగపెట్టి ఈగలను ' తరిమివేసి, చంపి, పట్టును కొట్టి తేనెను పిండుతారు ఈ మోటు పద్ధతే ఇప్పటికీ అనేకచోట్ల అమలులో ఉంది. అయితే ఆధునిక పద్ధతులలో తేనేటీగలను నిష్కారణంగా చంపడం, బాధించడం ఉండదు. ఈగలతో స్నేహంగా ఉంటూ వాటిద్వారా నిత్యమూ శుద్ధమైన తేనెను పొందగల సౌలభ్యం ఉంది. ఈనాడు తేనె తయారీ ఒక కుటీరపరిశ్రమగా పరిణమించింది. ఇందుకు అవసరమైన సరంజామా కూడా మామూలుగా అందుబాటులో వుండేదే. స్థూలంగా చెప్పాలంటే తేనె పట్టు స్థానంలో తీయడానికి వీలున్న ఫ్రేములు గల కొయ్యపెట్టెను ఉంచుతారు. దీనిని 'బీహైవ్' అనికాని 'బీబాక్స్' అనికాని అంటారు. ఈ పెట్టెలను పొలాల లోనూ, తోటల్లోనూ ముఖ్యంగా పుష్పించే చెట్లు ఎక్కువగా వుండేచోట వుంచుతారు. లేదా అడవులు దగ్గరగా వున్న ఇళ్ళస్థలాలలో ఉంచుతారు. ఒక రాణీ ఈగను పట్టుకువచ్చి ఈ పెట్టెలోని ఫ్రేముల్లో ఉంచుతారు ఈ రాణిగారిది స్థూలకాయం అందువల్ల అది పెట్టెకు వున్న చిన్న రంధ్రాలనుంచి బయటకు పారిపోలేదు. ఆపసోపాలు పడుతూ లోపలే ఉండిపోతుంది. బంటుఈగలన్నీ నిత్యం రాణిగారిని అంటిపెట్టుకుని సేవలు చేస్తూ ఉంటాయి. అందుచేత ఒకసారి రాణీగారిని తెచ్చి పెట్టెలో పెడ్తే బంటు ఈగలు అవంతట అవే వచ్చి రాణీగారి కొలువులో ప్రవేశిస్తాయి.

ఇంక తేనె పరిశ్రమకు కావలసిన ఇతర పరికరాలు తేనెను తీసే హనీ ఎక్‌స్ట్రాక్టర్, స్మోకర్, గ్లోవ్స్,

కత్తి, స్టూల్– ఇవన్నీ తేలిగ్గా దొరికేవే. తేనెపరిశ్రమ ఎంతటి లాభసాటిదయినదంటే పది పన్నెండు పెట్టెలు పెట్టుకుంటే చాలు– సాలుకి నూరు కిలోల స్వచ్ఛమైన తేనె లభ్యమౌతుంది. మార్కెట్ ధరతో పోలిస్తే సుమారు ఏడు వేల రూపాయలు.

## విచిత్ర జీవితం

తేనెటీగల జీవితక్రమం చాలా విచిత్రంగా ఉంటుంది. వీటికి ఎంతో అభివృద్ధి చెందిన సామాజిక జీవితం ఉంది. వీటికీ, మనుష్యులకీ ఎన్నో పోలికలు ఉన్నాయి మనుష్యులలో వలెనే వీటిలో కూడా రాచరిక వ్యవస్థ, వర్గబేధాలూ ఉన్నాయి. రాజులు, రాణులు, బంటులతో పాటు కోటలు, పేటలు కూడా ఉంటాయి తేనెపట్టును ఒక జనవాసపు కాలనీగా పరిగణించవచ్చు ఈ కాలనీలో 15 నుంచి 20 వేల వరకు ఈగలు ఉంటాయి. ఇవన్నీ సంతాన యోగ్యతలేని గొడ్రాలు ఈగలు రాణీ ఈగ కాలనీ అంతటికీ తల్లి వంటిది గొడ్రాలు ఈగలు సేవకులుగా వ్యవహరిస్తాయి వీటి పని నిత్యమూ రాణీ గారిని కనిపెట్టుకుని వుండి ఆవిడగారి అవసరాలు తీరుస్తుండడం, ఆహారం సమకూర్చడం, బయటకుపోయి తేనెను తెచ్చి పట్టునింపడం, పుప్పొడిని తెచ్చి మైనాన్ని తయారుచేసి తేనె కారిపోకుండా మెత్తడం, కావలసిన నీటిని తెచ్చి పట్టులోని గుళ్ళమీద జల్లి చల్లబరచడం, కాలనీని అంటే తేనెపట్టును శత్రువులనుంచి కాపాడడం వంటిది. పట్టు నిండగానే స్మోకర్‌ను ఉపయోగించి పట్టులోని తేనెటీగల్ని బయటకు తరుముతారు తర్వాత ఈగలు కుట్టకుండా చేతులకు గ్లౌవ్స్ వేసుకుని పెట్టెలోని ఫ్రేములను బయటకు తీస్తారు. వీటికున్న కంతలలోనే ఈగలు తేనెను భద్రపరుస్తాయి ఈ ఫ్రేములమీదున్న మైనాన్ని కత్తితోగాని చాకుతోగాని గీకి, వాటిని హనీ ఎక్స్ట్రాక్టర్స్‌లో పెట్టి వేగంగా తిప్పుతారు దాంతో తేనె రంధ్రంనుంచి బయటకు చిమ్మి పాత్రలో దిగువన జారుకుంటుంది తర్వాత ఆ ఫ్రేములను తిరిగి పెట్టెలో పెట్తారు. రాణీ ఈగను జాగ్రత్తగా చూసుకుంటూ తిరిగి దాని ఫ్రేములలో ఉంచుతారు. మళ్ళీ సేవక ఈగలు రాణిగారిని వెతుక్కుంటూవచ్చి పెట్టెలో ప్రవేశిస్తాయి అంతటితో కథ మళ్ళీ మొదలు ఈ కథ కంచికి వెళ్ళకుండా నిత్యమూ తేనెను మనకు అందిస్తూనే ఉంటుంది. ○

---

# నమస్కారము చేసే చెట్టు

-N.V.R. సత్యనారాయణమూర్తి

ఫరీద్‌పూర్ అనే ఊరిలో ఒక ఈతచెట్టు సూర్యుని రాకపోకలనుబట్టి లేస్తూ పడుకుంటూ వుండటం చూశారుట కొందరు. ఇంకేం.... ఈ చెట్టు సాష్టాంగ నమస్కారము చేస్తోందనే విషయం ఈ నోటా ఆ నోటా అందరికి తెలిసిపోయింది

ఈ వింతను చూడటానికి అక్కడికి జనం తండోప తండాలుగా వెళ్ళసాగారు ఆ చెట్టు దేవుడని పూజలు, నైవేద్యాలు జరిపిస్తున్నారు.

ఈ విషయం ఒక వ్యక్తి తెలుసుకున్నాడు. ఆ ఈతచెట్టు దగ్గరకు వెళ్ళి ఉదయం నుండి సాయంకాలము వరకు పరిశీలించాడు. ఆ చెట్టు సూర్యుని రాకతో ప్రొద్దెక్కే వరకు పైకిలేచి తరువాత సాయంకాలము వరకు క్రిందికి ఒరగటం చూశాడు. ఈ విచిత్రానికి కారణం తెలుసుకుందామని ప్రయత్నించుటకు కొన్ని యంత్ర పరికరములు అమర్చదలచుకున్నాడు

ఆ చెట్టు యజమాని ఇలాగ చెయ్యడం మహాపాపం. ఈ చెట్టులో దేవుని అంశ వుంది అన్నాడు ఆ వ్యక్తి ఆ చెట్టు యజమానికి నచ్చజెప్పి తన పరికరాల సహాయంతో పరిశోధన సాగించాడు. ఆ చెట్టు ఈవిధంగా లేస్తూ పడుతూ వుండటానికిగల కారణము సూర్యుని వేడిమి తప్ప మారే దేవుడు, దయ్యము కాదని చెప్పాడు. ప్రజలలో మూఢనమ్మకము తొలగడానికి కారణమయ్యాడు.

ఇంతకీ ఈ వ్యక్తి ఎవరో తెలుసా? ప్రఖ్యాత భారతీయవృక్షశాస్త్రవేత్త డాక్టర్ జగదీశ్ చంద్రబోస్.*

# సెయింట్ పీటర్ బాసిలికా

—భండారు పర్వతాలరావు

రోమ్ నగరం తగలబడుతుంటే ఫిడేల్ వాయిస్తూ కూచున్నాడనే పేరుపడ్డ నీరో చక్రవర్తికి యింకో దారుణంతో కూడ సంబంధముందని అంటారు. క్రైస్తవ మత బోధకుడైన సెయింట్ పీటర్‌ను ఈయన చిత్ర హింసలు పెట్టి చంపించాడు తరవాత పీటర్ శవాన్ని నీరో తన తోటలో పాతిపెట్టించాడని చెబుతారు. ఆపైన కొంతకాలానికి కాన్‌స్టంటైన్ చక్రవర్తి పీటర్ స్మారకార్థం ఒక మందిరం కట్టించాడు. వాటికన్ సిటీలో ప్రస్తుతం కనిపించే సెయింట్ పీటర్ బాసిలికా (మందిరం) వున్న చోటనే కాన్‌స్టంటైన్ కట్టించిన మందిరం వుండేది అది శిధిలావస్థలో వుంటే ప్రస్తుతం కనిపించే బాసిలికాగా దానిని పునర్నిర్మించారు.

అయితే ఈ మందిరం వున్న ప్రాంతం నీరోగారి తోటలున్న చోటు ఒకటికాదు అదెక్కడో, ఇదెక్కడో పరిశోధకులు అన్వేషించగా, నీరో తోట వుండేదని భావిస్తున్న ప్రాంతంలో ఒక సమాధి కనిపించింది. కాని అది ఖాళీగా వుంది !

పోప్ పయస్ XII యిచ్చిన ఆదేశాల ప్రకారం సెయింట్ పీటర్ బాసిలికా వున్న ప్రాంతంలో తవ్వకాలు సాగించారు అందులో భూమి అడుగున ఒక పెద్ద గోడ కన్పించింది. ఆ గోడపైన ఎర్రని గిలాబు చేశారు. అందులో ఒక వృద్ధుని శల్యావశేషాలు కనిపించాయి. (గోడ మధ్యలో శవాలను సమాధిచేసే ఆచారం లోగడ వుండేది) ఆ సమాధిలో కనిపించిన మట్టి బెడ్డలను శోధిస్తే ఆ మట్టి నీరో తోటలో లభించే మట్టిని పోలివుంది. గోడలో దొరికిన శల్యాలలో పుర్రె లేదు. రోంలోని సెయింట్ జాన్ బాసిలికాలో అనేక పురాతత్వ అవశేషాలున్నాయని చెబుతారు. అందులో సెయింట్ పీటర్ పుర్రె కూడా వుంది !

కనుక కాన్‌స్టంటైన్ చక్రవర్తి సెయింట్ పీటర్ శరీరాన్ని నీరో తోటలోంచి తరలించి తాను నిర్మించిన మందిరంలో సమాధి చేశాడా ? అక్కడి గోడలో దొరికిన శల్యాలు సెయింట్ పీటర్‌వా ? మరెవరివైనానా? ఈ ప్రశ్నలకు సరయిన జవాబు లేదు. ○

---

## మనిషిలో ... !

మనిషిలో స్మృతులు ఉండబట్టి
మనిషి నిలకడగా మనగల్గుతున్నాడు
ఆత్మల్ని మేల్కొలుపుతున్నాడు
రచనా వ్యాసంగంలో
రంగుల ప్రసంగంలో
సృజన చేయగల్గుతున్నాడు !
మనిషిలో జ్ఞాపకాల కెమెరా
ఉండబట్టి ... ...
మనసు పొరలో ... అరల్లో
కోరికల పొదుగు పిండుకొని
అదృశ్యాలను దృశ్యాలుగా మార్చగల్గు
తున్నాడు !
శిలువెత్తు విగ్రహాలను
ప్రతిష్ఠ చేయగల్గుతున్నాడు.

- యస్. యస్. రెడ్డి

# గీత అమృతవర్షిణి

——సాయి గంగామహాదేవ్

శ్లో॥ కవిం పురాణ మను శాసితార మణోరణీయాం సమనుస్మ రేద్యః ।
సర్వస్యధా తారమచింత్య రూపమాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ॥

— భగవంతుని యొక్క అష్టవిధదివ్య లక్షణాలను పేర్కొంటూ ఎవరు ఇట్టి దివ్యమూర్తిని యెడతెగక స్మరిస్తారో వారు అట్టి పరమ పురుషుని పొందుతారని దివ్యవాణి. ఐతే ఏమిటా దివ్యలక్షణాలు.

1. కవిం : భగవంతుడే కవి. కానీ నేడు 'కవి' అంటే నాలుగు పదాలు చేర్చి ఏదేదో వ్రాస్తే వాణ్ణి కవి అంటున్నారు. కాని అది కవిత్వం కాదు, వాడు కవి కాడు. కావ్యాలను సృష్టించే వాడు కవి. కానీ పదాలు అప్పటికే పుట్టిఉన్నవి. కావున ఈ కావ్య రచయితలు కవులు కారు. ఎవరు కవి? నామ రూపాలను రచించిన వాడే నిజమైన కవి. పంచ భూతాది స్థావర జంగమాదులను రచించినవాడే నిజమైన కవి. అతడే భగవంతుడు.

2. పురాణం : 'పురాభవతీతి పురాణం' పూర్వమందు పుట్టినది పురాణము అని అంటారు. కానీ ప్రతి దానికీ, దాని ముందు దొకటి వుంటది. అప్పుడు దాని ముందు ఇది నూతనమౌతుంది. కానీ భగవానుని ముందు మరొకటి లేదు. అతడే ఆది, లేదా ఆత్మనే అనాది. కావున ఆత్మపురాణం.

3. అనుశాసితారం : సకలమును శాసించెడివాడు అనీ అర్థము. సమస్త ప్రపంచము, సకలేంద్రియములు, సర్వ మనస్సులు భగవంతుని యొక్క, లేదా ఆత్మ యొక్క ఆధీనమందుంటున్నవి. ఆత్మ యొక్క అస్తిత్వము లేకుండా జగత్తుకానీ, మనో బుద్ధీంద్రియాదులు గానీ ఉండలేవు. కావున సమస్తమును పరిపాలించే అన్నింటి స్థితికి కారణమై దైవము, లేదా ఆత్మయే అనుశాసితారం.

4. అణోరణీయాన్ : అణువు కంటెను అణువు అనగా ఏమిటి? చాలా చిన్నవాడనా అర్థం. కాదుకాదు. పరమాణువులో కూడా వ్యాపించి ఉన్నట్టి వాడు భగవంతుడు. ఎలాగా? పంచభూతములలో ఒకటి కన్నా ఒకటి సూక్ష్మము. కారణము భూమి నుండి ఆకాశం వరకు చూస్తే ఒక్కొదానిలో ఒక్కొగుణం తగ్గుతుంది. ఆ కారణంగా ఒక దానికన్నా ఒకటి సూక్ష్మమౌతవి. సూక్ష్మ కారణంగా వానికి వ్యాపకశక్తి పెరుగుతుంది, అట్టి శబ్ద స్పర్శాది గుణములలో ఏ ఒక్కటి కూడా దైవమునందు లేదు. ఆ కారణంగా దైవం సూక్ష్మం. ఈ కారణంగా భగవంతుడు సర్వవ్యాపకుడని నిరూపించారు. కనుక అణువుకంటే అణువు అనగా గుణరహితుడై సర్వవ్యాపకుడై యున్నట్టి వాడని అర్థము.

5. సర్వస్యధాతారం : 'సర్వందధాతీతి ధాతా' — సమస్తమును ధరించిన వాడు — అని అర్థము. అనగా ఆధారమని అర్థము. జగత్తు ఆధేయము. జగదీశ్వరుడు ఆధారము. ఆధారము అవ్యక్తము, నిర్వికారము, ఆధేయము వ్యక్తము, వికారశీలము. 'సర్వస్య ధాతారం' అనగా అన్నింటికిని ఆధారంగా ఉన్నట్టివాడు, నిర్వికారుడు అని అర్థము.

6. అచింత్యరూపం : చింతించటానికి వీలుకాని రూపం కలవాడు. ఐతే రూపమంటే ఏమిటి? "రోప

యతి విమోహయతీతి రూపం రుపువిమోహనే' - మోహింపజేయునది అని అర్థము. అచింత్య రూప మనగా 'చింతించటానికి వీలుకాని మోహింపజేయునట్టి రూపం' అని అర్థము. జగద్రూపాలన్నీ చింతింప వీలై నటువంటి రూపాలు. దైవం చింతింపవీలుకాని రూపం. జగద్రూపానికి 1) పరిమాణము, 2) వర్ణము, 3) స్వభావము, 4) గుణము, 5) విషయములు 6) మార్పు - అనే ధర్మాలుంటాయి. కానీ దైవానికివి లేవు - పైగా మనస్సునకు క్రింద జగద్రూపాలున్నవి. మనస్సున కవతల దైవం ఉన్నాడు కావున దైవం అచింత్యరూపుడు.

7. ఆదిత్యవర్ణం : అంటే సూర్యకాంతి కలవాడని కాదు 'దితి' అనగా ద్వైతం, 'అదితి' అనగా ఏకత్వం అట్టి ఏకస్వరూపుడు భగవంతుడు కనుకనే అతడు ఆదిత్యుడు

8 తమసః పరస్తాత్ : వెలుతురు లేనిదే చీకటి వెలుతురున్న చోటు చీకటుండదు. భగవంతుడు సర్వ వ్యాపకుడు, స్వయంప్రకాశకుడు కనుక దైవానికి పరోక్షాపరోక్షులలో ఎచ్చట చీకటి లేదు అందుకనే అతడు తమసః పరస్తాత్. ఇచ్చి దైవాన్ని, ఆత్మను చేరినవాడు అతడే ఔశాడని దైవవాణి. ◯

మహనీయులు - మరపురాని సంఘటనలు - 12

# రాణా ప్రతాప్ సింహుడు

**కవుల ఆంజనేయశర్మ**

మేవాడ్ మొదలైన దుర్గములను పోగొట్టుకొన్న రాణాప్రతాప్‌సింహుడు, నానాబాధలు అనుభవిస్తూ, తన వారితో అరణ్యాలలో జీవితం గడుపుతున్న సమయం అది. తోడర్‌మల్, మానసింగ్ మొదలైన రాజులు పేరుప్రతిష్ఠలకోసం అక్బర్ పాదుషా కొలువు నందు చేరారు. దాస్య విముక్తి పొందనిదే తన దేశానికి ముక్తిలేదని, ఎన్నో కష్టాలు భరిస్తూ జీవిస్తున్నాడు రాణాప్రతాప్. శత్రువులపై దండెత్తడానికి సమయం కోసం చూస్తున్నాడు ప్రస్తుతం తన దగ్గర కావలసి నంత సైన్యంలేదు. తలోచోటుకు వాళ్ళంతా వెళ్ళి పోయారు అక్బరు పాదుషాపై దండెత్తటానికి కష్ట కార్యంగా తోచింది అతనికి తన జీవితంలో ఆ పని నెరవేరదనే ఆశ కూడా పోయింది 'ప్రయత్నించడం తన వంతు, మిగిలినదంతా భగవంతుని దయ'— అనుకొన్నాడు.

ఒకరోజు సాయంత్రం భామాషా అనే కోటీశ్వరుడు రాణాప్రతాప్‌ని అరణ్యంలో రహస్యంగా కలుసుకో డానికి వచ్చాడు. క్షేమసమాచారం మాట్లాడుకొన్నాక, "ఏం! ఇలా వచ్చారు?" - ప్రశ్నించాడు రాణా ప్రతాప్. 'ప్రభూ! మిమ్మల్ని ఒక విషయం అడగ టానికి వచ్చాను' — అన్నాడు భామాషా. 'ఏమిటది భామా? .... ఊఁ చెప్పు!' - అన్నాడు రాణా. 'ప్రభూ! నా దగ్గర ఉన్న ధనమంతా మీరు తీసుకోవాలి మన రాజ్య ప్రజల కోసం అదే నేను మిమ్మల్ని అర్థించేది. ఆ ప్రజలే అనాడు నన్ను ఎంతో ఆదరిం చారు. అందుచేతనే నేను ధనవంతుడనయ్యాను ఆ ప్రజలే ఇప్పుడు కష్టాలు అనుభవిస్తున్నారు. వారి రక్షణ కోసం ఈ ధనాన్ని ఖర్చుచేయడం నావంటి వ్యాపారుల ముఖ్య ధర్మం. అనుగ్రహించండి ప్రభూ! .... ఇప్పుడే రత్నాల రాసులు బళ్ళపై వస్తాయి'- అన్నాడు భామాషా ప్రతాప్ అనుమతి కోసం ఎదురుచూస్తూ.

'భామా! నిన్ను మరచిపోలేను' — అని రాణా ప్రతాప్ భామాను కౌగలించుకొన్నాడు. ఇద్దరి కను రెప్పల నుండి ఆనందబాష్పాలు రాలాయి. రాణాప్రతాప్ వంటి ప్రభువు, భామాషా వంటి ప్రభు భక్తులను కన్న భారతమాత ధన్యురాలు! ◯

# మెదడుకి మేత వేస్తే

చింతపల్లి అన్నపూర్ణ

ఇంగ్లీషులో ఒక సామెత వున్నది. 'ఏ పని అయినా మొదలుపెట్టి చూడు ఎట్లాగ పూర్తి అవుతుందో చూస్తే నువ్వే ఆశ్చర్యపోతావు అవి ఒక్కొక్కసారి సాధారణం అయిన కృత్యాలే అసాధారణం అయిన విజయాలకి దారితీస్తాయి.

కార్టూనిసు వాల్టర్ లాంట్జ్‌కి కొత్తగా పెళ్ళి అయింది. వాల్టరూ, ఆతని భార్య గ్రేస్ తమ హనీమూన్‌కి కాలిఫోర్నియాలోని షెల్‌వుడ్ లేక్‌కి వెళ్ళారు. అక్కడ ఒక చెక్క యింటిలో దిగారు. అక్కడ ఒక వడ్రంగి పిట్ట వాళ్ళు వున్న యింటి కప్పుమీద తొలుస్తున్నది. వాల్టరూ, అతని భార్యా దానికి 'వూడీ వుడ్‌పెక్కరు' అనే పేరు పెట్టారు. వాల్టర్ యూనివర్శల్ స్టూడియో వారికి 'కొత్త తార వచ్చింది' అని చెప్పారు. వాళ్ళు అతన్ని కొట్టి పారవేశారు. వాల్టర్ పెన్సిల్‌తో దాని బొమ్మను గీసి, తెరపైకి ఎక్కించగా అది బ్రహ్మాండమైన Success అయ్యింది. వూడీ వుడ్‌పెక్కర్ బొమ్మ 83 దేశాలలో ప్రదర్శించబడింది. కానీ వుడ్ పెక్కర్ నవ్వును గ్రేస్ లాంట్జ్ ఒక్కతే నవ్వగలదు.

లండన్‌లో 1880 లో చిత్రకారుడు అయిన ఫ్రాన్సిస్ బర్రౌడ్ (Barroud) గ్రామఫోను వింటుండగా అతని కుక్క నిప్పర్ కూడా చెవి పెట్టి వినసాగింది. 1895 లో నిప్పర్ చనిపోయిన తరువాత ఫ్రాన్సిస్ దాని బొమ్మ గీశాడు. ఆ బొమ్మా, దాని హక్కులూ 100 పౌండ్లకు (pounds) ఒక గ్రామఫోను కంపెనీకి అమ్మబడినాయి ఆ బొమ్మ పేరు 'హిస్ మాస్టర్స్ వాయిస్' ఆ బొమ్మ ఎంతో ప్రఖ్యాతి గాంచింది. నిప్పర్ బొమ్మ గ్రామఫోన్ రికార్డులమీదే కాకుండా, కలాల మీదా, ఏష్‌ట్రేల మీదా, టి షర్టులమీదా, 'టై' (Neck tie) ల మీద కూడా వచ్చింది. గ్రామఫోను కంపెనీ ట్రేడ్‌మార్కు నిప్పర్. నిప్పర్‌కు యింకా ఉత్తరాలు వస్తూనేఉన్నాయి.

ఒక రోజు బయట జోరున వర్షం కురుస్తున్నది. ప్రఖ్యాత రచయిత అయిన రాబర్ట్ లూయీస్ స్టీవెన్‌సన్ (Stevenson) యొక్క సవతి కొడుకు ఆ రోజు చాల అల్లరి చేస్తున్నాడు. అతన్ని సముదాయించటానికి స్టీవెన్‌సన్ వాటర్ కలర్సుతో మేప్ ఒక దాన్ని వూహించి గీశాడు. ఇది 1881 లో జరిగింది. ఆ మేప్ వైపు చూసిన తరువాత స్టీవెన్‌సన్ మెదడులో అడవులలో నిధికోసం వెతుకుతూ పోరాడుతున్న ఎన్నో పాత్రలు మెదిలాయి అప్పుడు రాయబడినదే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన నవల 'ది ట్రెజర్ ఐలండ్'.

1948లో ఒకరోజు స్విట్జర్లండ్‌కి చెందిన సైంటిస్ట్ జార్జ్ డిమెస్ట్రాల్ తన కుక్కతో వేటకు వెళ్ళాడు. అక్కడ పొదలో బర్‌డోక్ ( ఒక రకమైన మొక్క ) లోని బర్‌లు (ఒకరకమైన ముళ్ళు) కుక్క బొచ్చులోనూ ఆతని వులెన్ పాంటు (Wollen Pants లోనూ బాగా గుచ్చుకున్నాయి. డి మెస్ట్రాల్ శ్రద్ధగా గమనించాడు ఎన్నో కొక్కాలు (Hooks) ఎన్నో లూప్‌లకి తగిలింపబడి వున్నాయి. అందుకనే దానిగా బర్‌కు చాలా ప్రాముఖ్యం వున్నది. డిమెస్ట్రాల్ పరిశోధన వలన వెల్‌క్రో (Velcro) రూపు దాల్చింది. అది బిగుసుకోదు, తుప్పు పట్టదు, తేలికైనది, వుతుక తగినది. Nylon Fastener. ఈనాడు దాన్ని బట్టలకీ, కర్టెన్‌లకీ, వైద్యంలో (బ్లడ్ ప్రెజరు కప్పులు, సెర్వికల్ కాలర్లు ఆర్టిఫిసియల్ గుండెలు) విమానాలలో, కారులలో వాడు

తున్నారు. ఆస్ట్రోనాట్లకు వెల్‌క్రో ఆహారపు పాకెట్లు రాకెట్ గోడలకు అతికించటంలో, బూట్లు రాకెట్ నేలకి అతికించటంలోనూ వుపయోగపడుతోంది.

ప్రఖ్యాత అమెరికా సైంటిస్టు బక్ మిన్‌స్టర్ పుల్లర్‌కి మెల్లకన్ను వుండేది. కన్నులు సరిగ్గా కనపడేవి కావు. పుల్లర్ కిండర్ గార్డెన్‌లో వుండగా ఒకసారి వాళ్ళ టీచరు కొసిని పళ్ళు కుట్టుకునే పుల్లలు, కాయలు తీసుకు వచ్చి పిల్లల ముందు పడవేసి, వాటితో యిళ్ళు కట్ట మన్నాడు మిగతా పిల్లలు అందరూ చతురస్రంగా కట్టగా, కంటిచూపు సరిగ్గా లేని పుల్లర్ త్రికోణంగా యిల్లు కట్టాడు 'త్రికోణపు నిర్మాణమే అన్నింటిలోకి నిలకడగా వుంటుంది' అని పుల్లర్ ఋజువు చేశాడు అతన్ని టీచర్ మెచ్చుకున్నాడు. అదే పుల్లర్ పెద్ద అయిన తరువాత 'జియో డెస్కిక్‌డోమ్' పుల్లర్ ట్రేడ్ మార్కుగా దారితీసింది మాంట్రియల్‌లో జరిగిన ఎక్స్‌పో 67 లో పుల్లర్ నిర్మించిన 'తాజ్‌మహల్' (Tajmahal) చాలా ప్రఖ్యాతి గాంచింది అది 76 మీటర్ల పొడుగూ, 20 అంతస్తులు వున్నది.

జోసఫ్ పాక్స్‌టన్‌కి పూల మొక్కలు అంటే ఇష్టం. అతనికి రాయల్ బొటానికల్ గార్డెన్స్ నుండి ఒక వాటర్ లిల్లీ (Liley) మొక్క దొరికింది. అతను దాన్ని ఒక తొట్టిలోపెట్టి, రోజూ వేడినీళ్ల తొట్టిలో పోసేవాడు. ఆరు నెలలలో రెండు మీటర్ల పొడుగు వున్న 11 బలమైన ఆకులు తొట్టిలో వెలిసినాయి. జోసఫ్ పాక్స్‌టన్ కూతురు 7 పౌన్ల బరువు వున్న పిల్ల. ఒక ఆకు మీద పడుకునేది. తొట్టి లిల్లీ మొక్కకి చాలలేదు. లిల్లీ క్రింది భాగం షేపులో పాక్స్‌టన్ గాజుతొట్టి ఒకదాన్ని చేయించి, దాన్ని ఆ గాజుతొట్టిలో వుంచాడు. 1850 లో 'లండన్ హైడ్ పార్కులో జరిగే ఎగ్జిబిషన్‌లో కట్టబడే పెద్ద హాలు కోసం డిజైన్లు కావాలి' అన్నారు. పాక్స్‌టన్ తన లిల్లీ మొక్క ఆకారంలో డిజైన్ గీసి, సబ్‌మిట్ చేశాడు. అతని డిజైనే approve అయ్యి,



ఎన్నుకోబడింది. ఆరు నెలల్లో పాక్స్‌టన్ గీసిన డిజైనులో క్రిష్టల్ పాలెస్ కట్టబడింది. అది 85 సంవత్సరాలు వుండి, చివరకు 1936 లో అగ్నికి ఆహుతి అయిపోయింది.

రాబర్ట్ చీజ్‌బ్రో అమెరికాలోని న్యూయార్కుకు చెందిన ప్రసిద్ధ కెమిస్టు. 1859 లో అతను 22 వ ఏట పెన్‌సిల్‌వేనియా రాష్ట్రంలోని నూనె గనులకు వెళ్ళాడు అక్కడ పనివాళ్ల "ఒక మైనం లాంటి పదార్థం స్టీలు గొట్టాలకు అతుక్కుంటున్నది" అని చీజ్‌బ్రోకు చెప్పారు. "దాన్ని గాయాలకీ, కాలిన చోటా రాస్తే నయం అవుతున్నాయి" అని వాళ్లు చెప్పారు. చీజ్‌బ్రో దాన్ని పోగుచేసి, 11 సంవత్సరాలు కృషిచేసి, దానినుండి తయారుచేయగా వచ్చింది వేసలీన్ చీజ్‌బ్రో తన వొంటికి తనే గాయాలు, వాతలు పెట్టుకొని వేసలీన్‌తో నయం చేసుకున్నాడు. ఈనాడు వేసలీన్ ఎన్నిటికో 140 దేశాలలో ఉపయోగ

# ఆస్థాన విద్వాన్

మచిలీపట్టణ నివాసులు, సుప్రసిద్ధ పండితులు **శ్రీ కూచిభట్ల చంద్రశేఖరశర్మ గారు** మన "శ్రీవాణి" పత్రికలో "అమృతవాణి" శీర్షికలో శరపరంపరగా ఆధ్యాత్మిక విషయ వివరణం చేస్తూ పాఠకులు చిరపరిచితులు. శ్రీ శర్మగారు 11-6-95 ఆదివారంనాడు పరమ పూజ్య శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద అవధూత దత్తపీఠానికి "అస్థాన విద్వాన్"గా నియమితులై చాలా ఘనంగా సన్మానింపబడి నందుకు వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాం. ఇదే సందర్భంలో వారు రచించిన "శ్రీ లలితా సుప్రభాతం" అనే కేసెట్టు విడుదల చేయబడిందని తెలపటానికి సంతోషిస్తున్నాం. - సం.

పడుతున్నది. చేపలు పట్టేవాళ్ళు దాన్ని గాలంకు రాస్తారు. సముద్రంలో దిగే యీతగాళ్లు (Divers) దాన్ని ఒంటికి రాసుకుని, చల్లటి సముద్రంలో దిగుతారు. కారుల యజమానులు దాన్ని కారు బాటరీల మీద రాస్తారు- బాటరీలు చెడిపోకుండా వేసలీన్ చాలాకాలం నిలువ వుంటుంది రాబర్ట్ చీజ్ బ్రో తన 96వ ఏట 193‌ లో- మరణించాడు అతను జబ్బు చేసినప్పుడు తల నుండి పాదాల దాకా వేసలీన్ రాయించుకొని 'వేసలీన్ మూలంగానే నేను యిన్నాళ్లు బ్రతికివున్నాను' అన్నాడు

1971 జూలైలో చంద్రగోళం మీద దిగిన జేమ్స్ ఇర్విన్ 24 కిలోమీటర్లు చంద్రగోళంలో తిరిగాడు. ఆ కారు అమెరికా దేశీయుడు అయిన ఎడ్యుయార్డో కొరియన్ శాన్ జూయన్ చేత డిజైను చేయబడింది. ఆ కారు ప్రొటోటైపు పనికిరాని అల్యూమినియమ్ చెత్త, ఒక పాత గొడుగు, సైకిల్ హేండిల్‌బార్, కారు హబ్‌కాప్‌లు, స్టార్టర్ మోటారు, బాటరీలు, ఆర్మీలో పనికిరాని చెత్తాచెదారంతో తయారు అయ్యింది.

ప్రఖ్యాత అమెరికా శాస్త్రజ్ఞుడు థామస్ ఎడిసన్ ఎంతో కృషిచేసి మరణించిన వారితో మాట్లాడే యంత్రం ఒకదాన్ని కనిపెట్టేడు

మనిషికి కావలసింది జిజ్ఞాస అది వుంటే ఎంతో అభివృద్ధి జరుగుతుంది

)-○-(

# సాహిత్యశ్రీ

జూన్ 14. 15, 16 తేదీలలో బెంగుళూరులో జరిగిన అఖిల భారతీయ భాషా సాహిత్య సమ్మేళన్ (భోపాల్) 11వ కాన్ఫరెన్సులో శ్రీ కె. ఆర్. కె. మోహన్‌గారికి 'సాహిత్యశ్రీ' బిరుదు ప్రదానం చేయుటమైనది. వీరిని హృదయపూర్వకముగా అభినందిస్తున్నాము. వీరు 'శ్రీవాణి' లో ప్రతి నెలా "సైన్సు వాణి" శీర్షిక ద్వారా అనేక విజ్ఞాన విషయాలు పాఠకులకు అందిస్తున్నారు. - సం.

# జర్నలిజంలో స్వతంత్ర శిఖరాలు నధిరోహించిన ఖాసా

——————— ——————— కంచి వాసుదేవరావు

పత్రికా సంపాదకత్వాన్ని పరమనిష్ఠగా పవిత్ర విధిగా నిర్వర్తించిన అగ్రశ్రేణి సంపాదకులలో ఖాసా సుబ్బారావుగారొకరు అంతేకాదు - ఆంధ్రదేశం ఇంగ్లీషు జర్నలిజానికి సమర్పించిన నవరత్నాలలో సుబ్బారావుగారొకరు సి వై చింతామణి, కుందూరు ఈశ్వరదత్తు, కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, ఎం చలపతిరావు, జి వి. కృపానిధి, డా॥ పట్టాభి మిగిలిన రత్నాలు - ఖాసాగా ఆయన ప్రసిద్ధుడు.

1930 దశకంలో తెలుగు వారికి ప్రత్యేకంగా ఇంగ్లీషు దినపత్రిక వుండాలని - అది స్వాతంత్ర్య సంగ్రామ ముఖవాణిగా వర్ధిల్లాలని భావించి ప్రకాశం గారు స్వరాజ్య దినపత్రికను స్థాపించారు ఆ పత్రికా నిర్వహణలో - కుబేరస్థాయి నుంచి ప్రకాశంగారు కుచేల స్థాయికి జేరుకున్నారు న్యాయవాద వృత్తి ద్వారా సంపాదించుకున్న లక్షలాది రూపాయలు విలువగల స్థిర చరాస్తులు హారతి కర్పూరంలా హరించుకుపోగా - 'స్వరాజ్య కేతనం' అనవతం కాకుండా వుండటానికి - ఆయన నిధులకోసం పర్యటిస్తూ వుండేవారు. ఆ సమయంలో ఆ పత్రికను అనేక ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటూ నిలబెట్టినవారూ - ఆ పత్రిక ఆగిపోయే వరకూ అంటిపెట్టుకుని వున్నవారు కృపానిధి, సుబ్బారావుగారు.

## నిర్భయత్వానికి ప్రతీక

తాను నమ్మినది తన యజమానికి ఆగ్రహం కలిగించినా ధైర్యంగా చెప్పగలవారు - పత్రికలో రాయగలిగిన వారు సుబ్బారావుగారు. స్వరాజ్య పత్రికలో సిబ్బందికి జీతాలు తక్కువగా వుండేవి - అవయినా సమయానికి అందేవి కాదు అందినా పూర్తిగా అందేవికావు సిబ్బంది ఎంతో కటకటలాడుతూ దీనావస్థలో వుండేవారు. ఇలా వుండగా పోస్టలు ఉద్యోగుల దీనావస్థ గురించి ప్రకాశం గారు చేసిన ప్రసంగాన్ని స్వరాజ్య పత్రికలో ప్రచురించడానికి ఖాసా నిరాకరించారు. ప్రకాశంగారు అందుకు సంజాయిషీని కోరినప్పుడు 'మీ పత్రికలో పనిచేసే సిబ్బంది పరిస్థితి అంతకన్న దయనీయంగా వున్నప్పుడు పోస్టలు ఉద్యోగుల దురవస్థ గురించి కన్నీరు కార్చే హక్కు మీకు ఎక్కడిది ?' అని సూటిగా ప్రశ్నించగల గుండెధైర్యం మనిషి సుబ్బారావుగారు ప్రకాశంగారు సహృదయుడు కనుక ఆ వాస్తవ విమర్శని హుందాగా స్వీకరించారు.

జీతాలు సరిగ్గా యివ్వకుండా ఎన్నాళ్ళు మమ్మల్ని బాధపెడ్తారంటూ 'దులిపి వేద్దా'మని సుబ్బారావుగారు - పర్యటన పూర్తిచేసుకు వచ్చిన ప్రకాశంగారి గదిలోకి దూకుడుగా వెళ్ళేవారు కాని కుర్చీలో దీనంగా చిరిగి పోయిన చొక్కాతో అలసిపోయిన ప్రకాశంగారిని చూడగానే ఆయన హృదయం ద్రవించేది. మారు మాట్లాడకుండా తిరిగి వచ్చి తన కష్టాలను మౌనంగా భరించేవారు

## గోయంకా నీ

పుటంలో పెట్టిన బంగారంలా స్వరాజ్యలో రాటు దేరిన సుబ్బారావుగారు రామనాథ గోయంకా దృష్టిలో

## సాయి గీత

" యే దోషం త్వయి పశ్యంతి
నతాన్నిందస్వ పుత్రక
త్యక్త్వా దోషం భజస్వైత
అన్యతో భవసి సజ్జనః "

నీయందుగల దోషములను ఇతరులెవరైన ప్రకటించినపుడు వారిపై నీవు కోపింపరాదు. నీయందున్న దోషములను తొలగించుకొనవలెను. నీ దోషమును ప్రకటించినవారిని పూజింపుము. నీ దోషమును తెలిసికొని దానిని వదలినపుడు నీవు సజ్జనుడవు కాగలవు

పద్దారు. ఆయన ఇంగ్లీషులో ఇండియన్ ఎక్స్‌ప్రెస్, తెలుగులో ఆంధ్రప్రభ దిన పత్రికను గోయంకా స్థాపించిన సమయమది. ఈ రెండు పత్రికలకు సుబ్బారావుగారిని గోయంకా సంపాదకులుగా నియమించారు. ఐతే రెండు దిన పత్రికలను ఒక్కరే చూచుకోవడం సాధ్యం కాదు కనుక — సుబ్బారావుగారు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంపాదకత్వంతో తృప్తిపడగా ఆంధ్రప్రభకు న్యాపతి నారాయణమూర్తిగారు సంపాదకులయ్యారు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో కొనసాగి వుంటే ఆయన బ్రతుకు బాట రాజమార్గంగా మారివుండేది. కాని స్వతంత్ర ప్రవృత్తిగల సుబ్బారావుగారు ఇండియన్ ఎక్స్‌ప్రెస్సులో కొనసాగలేకపోయారు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసి, కాంగ్రెస్ నాయకులు జైలు నుంచి విడుదలయి దేశస్వాతంత్ర్యం కనుచూపు దూరంలోవున్న సమయంలో సుబ్బారావుగారు ఇంగ్లీషు తెలుగులలో 'స్వతంత్ర' అనే వార పత్రికను స్థాపించారు. సుప్రసిద్ధ వార పత్రిక ఆనందవాణి సంపాదకులైన ఉప్పులూరి కాళిదాసుగారు సుబ్బారావుగారిని ఈ విషయంలో బాగా ప్రోత్సహించారు.

## స్వతంత్ర స్వర్ణయుగం

ఇంగ్లీషు స్వరాజ్యము తను చూచుకుంటూ తెలుగు స్వతంత్రని గోరా శాస్త్రిగారికి అప్పగించారు. ఇంగ్లీషు తెలుగులలో— ఇటువంటి ఉన్నతస్థాయి పత్రికలు— అంతకుముందు కాని ఆ తర్వాత కాని రాలేదంటే అతిశయోక్తి కాదు ఇంగ్లీషు స్వతంత్రలో 'సాకా' అన్న కలం పేరుతో రాసిన సైడు లైట్సు రఘునాథ అయ్యర్ నిర్వహించిన 'సోటోవోచీ' పాఠకులను విపరీతంగా ఆకర్షించేవి. స్వతంత్ర సంపాదకీయాలు సూటిగా ధాటిగా 'ఖాసా' ముద్రలో వుండేవి ఆ పత్రికలో పడిన ప్రతి రచనా ఆణిముత్యమే.

సుబ్బారావుగారు ఈ రెండు పత్రికలను ఉన్నత ప్రమాణాలతో నడిపారు కాని— తగిన ఆర్థిక పుష్టి చేకూర్చలేకపోయారు. పత్రికా నిర్వహణ సంపాదకత్వం రెండూ సాధ్యపడలేదు ఆ సమయంలో హెచరిరాజా అనే పారిశ్రామికవేత్త— పత్రికా నిర్వహణా భారాన్ని పైన వేసుకున్నారు ఆయన పాత్ర— పత్రిక వ్యాపార ఆర్థిక విషయాలు చూడటానికి పరిమితమవుతాడని సంపాదక విషయాలలో జోక్యం చేసుకోరని సుబ్బారావుగారు అమాయకంగా భావించారు కాని దగాపడ్డట్టు చాలా కొద్ది కాలానికే తెలిసివచ్చింది మారు ఆలోచన లేకుండా ఆయన బయటకు వచ్చేసారు.

## స్వరాజ్య సారథి

తర్వాత తన గురువుగారి పత్రిక పేరుతో 'స్వరాజ్య' ఇంగ్లీషులో పత్రికను స్థాపించారు. అదృష్ట వశాత్తు సుబ్బారావుగారిపట్ల విపరీతమైన ఆరాధనాభావం కల ప్రసిద్ధ తమిళ పత్రిక 'కల్కి' సంపాదకులు సదాశివన్, ఆయన భార్య అంతర్జాతీయ

చెందిన గాయని ఎం. ఎస్. సుబ్బులక్ష్మి పత్రికాముద్రణ నిర్వహణ బాధ్యతను స్వీకరించి ఆయన శ్రమను ఎంతగానో తగ్గించారు. అప్పటికి దేశ రాజకీయాలలో గణనీయమైన మార్పులు వచ్చాయి. నెహ్రూ సోషలిస్టు ఆర్థికవిధానాలతో ఏకీభవించలేక రాజాజీ, కె. ఎం. మున్షీ, మినూమసానీ, ఆచార్య రంగా కాంగ్రెస్‌నుంచి విడిపోయి స్వతంత్రపార్టీని స్థాపించారు. రాజాజీకి ప్రియశిష్యుడైన సుబ్బారావుగారు కూడా స్వతంత్రపార్టీ ఆదర్శాలతో ఏకీభవించారు. స్వతంత్రపార్టీకి ఒక ముఖవాణి అవసరం ఏర్పడింది. స్వరాజ్య ఆ అవసరాన్ని తీర్చింది.

రాజాజీ స్వతంత్రను తన సొంత పత్రికగా భావించేవారు. ప్రతి వారమూ ఆ పత్రికకు పైన్సు ఆర్టికల్సు రాస్తూవుండేవారు. కాని స్వతంత్ర అధిరోహించి ఉన్నతశిఖరాలను స్వరాజ్య అధిరోహించలేకపోయిందని కొందరు విమర్శకులు భావిస్తారు. ఒక రాజకీయపార్టీ పత్రికగా అది ముద్ర తీసుకోవడం ఒక కారణం కావచ్చు. అలా అనుకున్నా స్వరాజ్య స్వతంత్ర అంత కాకపోయినా మంచి పత్రికే. సంపాదక చంద్రుడికి ఖాసా షోడశ కళలలో - ఒకటి రెండు కళలు తగ్గినా, ఆయన వెదజల్లిన వెన్నెల స్వచ్ఛమైనదీ, ప్రకాశవంతమైనదీ.

## స్వాతంత్ర్య సమరయోధులు

సుబ్బారావుగారు స్వాతంత్ర్య సమరయోధుడు. సైమన్ కమీషన్ బహిష్కరణ ఆందోళనలో ఆయన గురువు ప్రకాశంగారు తుపాకీగుండుకు గుండెలు చూపిస్తే - శిష్యుడు సుబ్బారావుగారు పోలీస్ లాఠీ దెబ్బలు తిని స్పృహ కోల్పోయారు.



" నిశ్చిత్య యః ప్రక్రమతే
నాన్తర్వసతి కర్మణః
అవన్ధ్యకాలో విశ్యాత్మా
సవై పండిత ఉచ్యతే।

ఎవరైతే ఆలోచించుకొనిన తరువాతనే పనిని ప్రారంభించుచున్నాడో, పనిని మధ్యలో నిలిచిపోడో (ఆపివేయడో), కాలమును వ్యర్థము చేయడో, మనస్సును వశమునందుంచుకొనుచున్నాడో - అతడే పండితుడు.

ఆయన అతి సున్నితహృదయుడు. క్విట్ ఇండియా ఆందోళనలో పాల్గొని జైల్లో వున్న సమయంలో ఒకరు మరణశిక్ష పడిన ఖైదీలను ఎలా ఉరివేస్తారో వివరంగా చెప్పినప్పుడు సుబ్బారావుగారు విపరీతంగా కలవరపడిపోయారుట, చాలా సేపటివరకు ఆయన మామూలు మనిషి కాలేకపోయారుట.

ఆయన ప్రథమశ్రేణి సంపాదకులు, అంతకుమించి మానవతావాది, మహామనీషి.



# భక్తిశ్రద్ధల మార్గాన సమాజం ముందడుగు

—— ఆర్. ఎస్. కె. మూర్తి

బొంబాయి నుంచి వెలువడే ఇంగ్లీషు పత్రిక ఒకటి ఈ మధ్య ఒక విశేష వ్యాసం ప్రచురించింది ఢిల్లీ, బొంబాయి, మద్రాసు వంటి మహా నగరాలలో.... ఉన్నత, మధ్యతరగతి కుటుంబీకులు మధ్య సాయంత్రాలు ఏ సినిమాలకో, క్లబ్బులకో వెళ్ళటం లేదుట ఇంటికొచ్చేసి, శుభ్రంగా స్నానాలు చేసి, పూజాదికాలలో నిమగ్నులవుతున్నారట విష్ణు సహస్రనామ స్తోత్రం వంటివి భక్తిశ్రద్ధలతో పారాయణం చేస్తున్నారుట. అయోధ్య ఉద్యమం వంటివి ఈ మార్పుకు కారణమని ఆ పత్రికా రచయితేదో రాజకీయమైన విశ్లేషణలు చేశారనుకోండి మనకది అనవసరం మనం గమనించదగినదల్లా భక్తిప్రపత్తులు మళ్ళీ మన మధ్య పెరుగుతున్నవనే ఆనందదాయకమైన వాస్తవం

ఒక్క చిన్న మాటలో చెప్పాలంటే - మనది ఆధ్యాత్మిక దేశం భౌతిక సంపదలూ, ఐహిక సుఖాలూ కంటె పారమార్థికానికి, పరమేశ్వర సాన్నిధ్యాలకై పరితపించే సాంప్రదాయం మనది పాశ్చాత్య పాలన, పాశ్చాత్య సిద్ధాంతాల ప్రభావానికి, ప్రలోభాలకూ మనమీ మధ్యకాలంలో బాగా గురి అయినాం ఆ కారణంగా మనవైన చితి, చింతనలను మనం ఏదో ఒక మేరకు మరిచిపోయాం మళ్ళీ యిప్పుడు క్రమ క్రమంగా.... నెమ్మది నెమ్మదిగా.... మన కుదురులో (Roots) మనం కుదురుకునే సూచనలు, ధోరణులు కనపడటం ఆనందదాయకమే కదా !

అయితే యిక్కడొక అభ్యంతరం కొందరు లేవనెత్త వచ్చు ఇట్లా పూజాదికాలు చేసేవారు పారమార్థిక దృష్టితోనే వాటిని నిర్వహిస్తున్నారా ? వీటిని చేస్తున్నది కూడ భౌతిక సంపదలూ, సుఖభోగాల కోసమే కదా ? నిష్కామంగా వీరు భగవానుని ధ్యానించగలుగుతున్నారా ? పరార్థం కాంక్షించి, వీరీ పారాయణలు జరుపుతున్నారా ?

నిజమే ఈ ప్రశ్నలు పూర్తిగా కొట్టివేయదగినవి కావు అయితే గీతాచార్యులే చెప్పారు కదా !

చతుర్విధా భజంతే మాం జనాంసుకృతినోర్జున।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ !

భక్తులు నాలుగు విధాలుగా ఉంటారని భగవానుడే విభజించారు 1) ఆర్తులు : ప్రాపంచిక బాధల నుండి విముక్తి గోరేవారు. ద్రౌపది, గజేంద్రుడు ఆర్తులే కదా ! 2) అర్థార్థులు : ప్రాపంచికములైన ఐశ్వర్యము, అధికారము, కీర్తి మొదలగునవి వాంఛించువారు. ధృవుడు అట్టి అర్థార్థియే 3) జిజ్ఞాసువులు : జ్ఞానమునందు ఆసక్తి కలవారు. 4) జ్ఞానులు : వీరలు సాధన ముగిసి, జీవన్ముక్తులయ్యేవారు. ప్రహ్లాద నారదాదులు అట్టి జ్ఞానభక్తులు

ఈ భక్తులందరూ శ్రేష్ఠులే అయినప్పటికి వారియందు జ్ఞానభక్తుడు పరమ శ్రేష్ఠుడని పేర్కొంటారు గీతాచార్యులు. కాబట్టి కామవాసనా ప్రాబల్యంవల్ల భక్తులైనవారు కూడ నిత్య పూజాదికాలు నిర్వర్తించటం ద్వారా, జ్ఞానభక్తులై పరమేశ్వర సాన్నిధ్యాన్నే పొందగలరని భగవానుడు ఆశీర్వదిస్తున్నాడు

అందువల్ల ఆధ్యాత్మిక చింతన మన మధ్య చోటు చూసుకోవటమన్నదే ప్రధానమైన విషయం అంతే

తప్ప, ఒక్కసారిగా మామూలు మనిషి ఉత్తమోత్తమ మానవుడై, జ్ఞానుడై, దివ్యుడైపోతాడని కాదు. రోజూ ఒక గంటసేపు ఏ ప్రార్థనలో, పూజలో నియమంతప్పకుండా చేస్తే అది వారు స్వార్థచింతనతోనే చేసినప్పటికీ కూడ ఏ నెలో రెండు నెలలో తర్వాత వారు ఏ కొంచెమో ఎదిగిన మానవులే అవుతారు నియమానుసారంగా జరిపే జపాదికాలవల్ల మనస్సు పరిపక్వతను రోజూ పొందుతూనే ఉంటుంది. ఒక చెట్టున పండు పండినట్లుగా భక్తుని ఆలోచనలు పరమపదమార్గాన ఫలప్రదమవుతూ ఉంటై చెట్టునుంచి రాలినపండు శిష్ట పురుషునిచేత పడి ధన్యమైనట్లుగా భక్తుడూ పరిపక్వ మనస్కుడై భగవానుని ఒడిలో రాలిపోతాడు.

అసలదీగాక ఏ జపమో, పారాయణమో మనమెటువంటి స్వార్థపు ప్రతిఫలాన్ని ఆశించి చేసినా అది పదుగురికీ పరమ ప్రయోజనకారిగానే ఉంటుంది కూడ తాను పిలువనంపితే రాలేదని ఒక రాజొక తపస్విపై ఆగ్రహించాడుట దానికా తపస్వి తన తపస్సులో రాజుకెట్లాగూ ఆరవవంతు ఫలం దక్కుతూనేఉన్నదనీ అందువల్ల తాను రాజుకు ఏ విధంగానూ ఋణపడలేదనీ వివరించాడట.

అట్లాగే మనం మనకోసమే జప, పారాయణాదులు నిర్వహించినా అవి పదుగురికీ ప్రయోజనకారులే కాగలవు ఉదాహరణకు .... విష్ణుసహస్రనామస్తోత్రం ఫలశ్రుతిలో యిలా చెప్పబడింది.

ధర్మార్థ కామ మోక్షములో దేనిని కాంక్షించి భక్తులు పారాయణం చేస్తారో వారికా ఫలసిద్ధి లభించగలదని చెపుతూనే -

న క్రోధో నచమాత్సర్యం
నలోభో నాశుభామతిః
భవంతి కృత పుణ్యానాం
భక్తానాం పురుషోత్తమ్।

# యక్ష ప్రశ్నలకు సమాధానములు

" ఇష్వస్త్రమేషాం దేవత్వం
యజ్ఞ ఏషాం సతామివ
భయంవై మానుషోభావః
పరిత్యాగోఽసతా మివ "

- ధర్మరాజు

క్షత్రియులకు అస్త్రవిద్యలవల్ల దేవత్వమూ, యజ్ఞంవల్ల సజ్జనత్వమూ, పిరికితనంవల్ల మానవత్వమూ, శరణాగతులను రక్షింపక పోవడంవల్ల దుర్జనత్వమూ ప్రాప్తిస్తాయి.

---

భక్తులు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అరిషడ్వర్గాల్ని జయించినవారవుతారని కూడ చెప్పబడింది. వాటిని జయించిన వ్యక్తుల సమూహంగా సమాజం రూపొందడం కంటే కోరదగినదేమున్నది!

అయితే, యిటువంటి సద్గతులను, సత్ఫలితాలు కదాచిత్తుగా లభించటంకంటే, వాటియందే మనస్సు లగ్నం చేసి భగవానుని సేవించటం, ధ్యానించటం ఉత మోత మమే.

అట్టి నిష్కామ స్థితిని అందుకోలేనివారు తమకు చేతనైనంత నిష్ఠతో తమకు సాధ్యమైన భక్తిశ్రద్ధలతో భగవధ్యానంలో పరితృప్తులు కాగలరు.

కుటుంబాలలో పెద్దలిట్లా భక్తి ధ్యానతత్పరులై ఉంటే పిన్నలు కూడ వారినే అనుసరించి, పెద్దలు అందుకోలేని సద్గతులను, సత్ఫలాలను వారలు అందుకోవచ్చు. ఏమంటారు ? 

బాబా దివ్య సందేశం (8వ పేజీ తరువాయి)

పెట్టారు. కనుకనే ఈ భుజములకు "క్షత్రియ" అని పేరు పెట్టారు. ఇంక ఉదరము మనం తిన్న పదార్థములను చక్కగా జీర్ణింపజేసి, సర్వాంగములకు సప్లయిజేస్తుంటుంది. కనుకనే దీనికి "వైశ్య" అని పేరు పెట్టారు. ఈ మూడింటికి ఆధారము చేసుకొని జీవితాన్ని గడపడానికి పాదములే ప్రమాణమని దీనికి "శూద్రత్వము" అన్నారు. ఇలాంటి యదార్థమైన సత్యమును గుర్తించడానికి ప్రయత్నించక ఈనాటి మానవులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని ప్రత్యేకమైన తెగలుగా భావిస్తున్నారు. కాదు ... కాదు ఒక్కొక్క అంగమునందు కూడనూ, ఒక్కొక్క దివ్యమైన భావమును నిరూపిస్తూ వచ్చింది వేదము. ఇలాంటి పనులు చేయగల్గినటువంటియొక్క దివ్యమైనటువంటి భాగమే ఈ యొక్క మతము. అన్నీ ఒక్క దేహంలో ఏకంగా ఉండినటువంటివే. "ఏకాత్మ సర్వ భూతాత్మ" ఈ మూడింటి (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య) ని కూడను కాపాడేటటువంటి భాగము (పాదము) లే శూద్రత్వము వీరిని కేవలం పనికిమాలిన వారిగా భావిస్తున్నాం మనం కాదు .... కాదు .... బ్రాహ్మణ (ముఖము), క్షత్రియ (భుజములు), వైశ్య (ఉదరము) ఈ మూడు కూడనూ పాదముల (శూద్ర) పైననేఆధారపడిఉంటుండాలి ఇలాంటిపవిత్రమైనటువంటి దివ్య స్థానమును ఈనాడు మనము కేవలం ఒక అసహ్యమైన రీతిగాను, విలువలేనటువంటిదానిగాను మనం భావిస్తున్నాం, ఇది సరియైనటువంటిది కాదు నిజముగా పాదములే లేకపోతే, ఈ అంగములన్నీ వుండి కూడా ప్రయోజనంలేదు అన్నిటికంటే ప్రధానమైనటువంటిది, ప్రమాణమైనటువంటిది పాదము, ఎవరైనా పూర్వం పల్లెలలో తప్పుచేస్తే, వాడి పాదములపై పడు! క్షమిస్తాడు అనేవారు కనుక దేహమునుకూడా క్షమింపజేసేటటువంటిది పాదము. ఇంతటిశక్తిసామర్థ్యములు కలిగినటువంటి ఈ పాదములను అలక్ష్యంగా మనం భావిస్తున్నాం. శక్తి హీనమైనటువంటివిగా భావిస్తున్నాం. ఇది చాలా పొరపాటు.

దేశంలో అనేక అల్లకల్లోలములు చెలరేగడానికి కారణం మనం మంచిని చెడ్డగాను, చెడ్డను మంచిగాను భావించడమే. అంతర్ సంబంధమైన ఆత్మతత్త్వమును ఎవరూ గుర్తించడానికి ప్రయత్నించడం లేదు తలపైన ఉన్నది, పాదము క్రింద ఉన్నది. మనం బజారులో నడుస్తున్నప్పుడు, కన్ను ఒక ముల్లును చూచింది. కన్ను ముల్లును చూచిన తక్షణమే కాలు దాటుతుంది. కన్ను ఏమైనా వచ్చి కాలుకు చెప్పిందా? లేదు, ఇదే అంతర్ సంబంధం. కాలుకు ముల్లు గుచ్చుకుంటే అక్కడ నొప్పి చేస్తుంది. ముల్లు కాలికి గుచ్చుకుంటే కన్ను ఏడుస్తుంది. చూడండి! ఎంత అంతర్ సంబంధం ఉన్నదో! అనగా ఏమిటి? శూద్రునికి కొంచెం కష్టం కలిగితే బ్రాహ్మణుడు చాలా బాధపడాలి, కాని ఈనాడు మనం భావించే బ్రాహ్మణుడు మాత్రం వాడికి వచ్చింది వాడే అనుభవించుకొని, వాడి కర్మ అని ఊరుకుంటున్నాడు. ఇది కాదు సరియైనటువంటి సంబంధం ఈ విధమైనటువంటి అంతర్ సంబంధమైనటువంటి ఆత్మతత్త్వాన్ని మనం ఏకంగా భావించాలి. అదియే "ఈశ్వర సర్వ భూతానాం" "ఈశావాస్య మిదం జగత్" ఒకరికొకరికి ఇలాంటి సన్నిహిత సంబంధ బాంధవ్యం వుండినప్పుడే జగత్తు సుభిక్షంగా, నిత్యకళ్యాణం పచ్చతోరణంగాఉంటుంది. ఈనాడు మనం భావించే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అనేవి కులాలుగా భావిస్తున్నాం. కాదు మన దేహములో ఉండినటువంటి అంగములో. కుల మతాలకు సంబంధించినటువంటివి కావు. మన "మతి" కి సంబంధించినటువంటిది

" మతములన్ని చేరి మంచినే బోధించె
తెలసి మెలగవలయు తెలివితోడ
మతులు మంచివైన మతమేమి చెడ్డది? "

కనుక మతములో దోషములేదు, మన మతిలోనే దోషమున్నది. కనుక ప్రతి మానవుడు ఇటువంటి ఏకత్వాన్ని గుర్తించి, దివ్యత్వాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని, ఈ పవిత్రమైనటువంటి జీవితాన్ని సార్థకం గావించుకోవాలి.

ప్రేమస్వరూపులారా !

అందరి యందు వుండినటువంటిది ఒక్కటే ఒక్కటి- అదే ఏకత్వం ఈ ప్రేమతత్త్వం ఒక్కటే దైవము నకును భక్తునికిని వుండినటువంటి సన్నిహిత సంబంధం- ఈనాడు ప్రపంచంలో అనుభవించేటటువంటి ప్రేమలు, నిజమైన ప్రేమలు కావు. తల్లి – బిడ్డ, భార్య-భర్త, అన్న-తమ్ముడు మధ్యనున్నది ప్రేమ కాదు, అది అనురాగమే ప్రేమ అనగా ఏమిటి ? ఎప్పటికి మార నటువంటిదే ప్రేమ ఈ ప్రాకృతమైన సంబంధ బాంధవ్యాలు క్షణక్షణమునకూ మారిపోతుంటాయి. పెండ్లి కాకమునుపు భార్య ఎవరు ? భర్త ఎవరు ? అప్పుడు ఈ ప్రేమ ఎక్కడికి పోయింది ? అప్పుడు ఈ ప్రేమ ఎవరికీ తెలియదే ? కాబట్టి ఇది మధ్యలో వచ్చినటు వంటిదే, తల్లీ బిడ్డల ప్రేమ, బిడ్డ పుట్టకమునుపు తల్లికి ఈ బిడ్డపై ప్రేమ ఎట్లా ఉంటుంది ? పుట్టిన తరువాతనే తల్లికి బిడ్డపైన ప్రేమ వస్తుంది. దీనికి పూర్వం లేదే? కనుకనే మొదలు, మధ్యలో, కడపటికి – ఈ మూడు కాలములయందును నిలిచినటువంటిదే ప్రేమ ఆ ప్రేమనే "దైవత్వము" అని పిలిచారు. అది కేవలం భక్తునికి, భగవంతునికి ఉండినటువంటి సంబంధం. ఈ ప్రేమ త్రికాలముల యందును మారనటువంటిది. అందువలననే త్రికాల భాజ్యం సత్యం అన్నారు. ఈ ప్రేమచేత ఏర్పడినటువంటిదే దివ్యమైనటువంటి సంబంధం.

మనం ఈనాడు రాబోయే భవిష్యత్తును గురించి యోచిస్తున్నాం గడచిపోయిన భూతకాలమును గురించి విచారిస్తున్నాం. అది భూతమే అది తిరిగి మనకు ఇంకా రాదు. కనుక భూతమైన కాలమును గురించి ఎందుకు విచారించాలి ? Past is Past గడచిపోయినది ... గడచిపోయినది. ఇంకా భవిష్యత్తు. ఇది ఏమాత్రం మనకు నమ్మకం లేదు. రేపు .... రేపు .... అనేటటు వంటిది నీకేం నమ్మకం ? రేపటివరకు ఉంటామో ఉండమో. కాబట్టి భవిష్యత్తు అనే దానిని కూడా నమ్మ కూడదు మనం భవిష్యత్తు, భూతకాలములను గురించి చింతించటం చేతనే వర్తమానాన్ని మరచిపోతున్నాం. ఈ వర్తమానాన్ని మరచిపోవటమే మన దుఃఖానికి మూలకారణం వర్తమానాన్ని లక్ష్యములో పెట్టుకోవాలి. నడచుకొని వచ్చిన రోడ్డును చూచుకుంటూనే వచ్చాము దానినిక మరచిపోవాలి.

ఒక చిన్న ఉదాహరణ పూర్వము వృక్షము, ఇప్పుడు విత్తనము, భవిష్యత్తులో వృక్షము కాబట్టి భూతములో వుండినటువంటి వృక్షము, భవిష్యత్తులో వుండినటువంటి వృక్షము, Present seed (వర్తమానం లోని విత్తనం) లో నుండి వచ్చినవే. కనుక వర్తమానంలో నీవు మంచి కార్యములు చేయి. వర్తమానంలో మంచిఆలోచనలు సలుపు. వర్తమానంలో ఆనందంగా ఉండు, భవిష్యత్తు అంతా ఆనందంగానే వుంటుంది. రాబోయే భవిష్యత్తును గురించి ఎందుకు విచారించాలి ! కనుక ఇప్పటికిప్పుడే "ఎప్పటికయ్యేది ప్రస్తుతమప్పటిగా మాటలాడుట !" ఈ అనవసర మైనవిచారములలోమునిగి లేవిపోని దుఃఖములకుగురియై పోతున్నాం మనం విచారాలకు ఏమాత్రం అవకాశం అందించకూడదు. జీవితంలో కష్టములుగాని, నష్టములు గాని ధైర్యంగా ఎదుర్కోవాలి. ఆ శక్తి కూడా నీలో వుండాలి నీవు ఎందుకు దానిని దుర్వినియోగం చేస్తున్నావు? ఇదియే నీ దుఃఖానికి మూలకారణము. కనుక నీవు రాబోయే దానిని ఎదుర్కొనడానికి వర్తమానంలో బలాన్ని సంపాదించుకో. ఆ వర్తమాన బలమే దైవబలము ఆ దైవబలమొక్కటే మనచేతిలో వుంటే సమస్త బలములు హస్తగతమైపోతాయి.

దైవానుగ్రహమును పొందే నిమిత్తమై అనేక విధములైన సాధనలు చేస్తున్నాం. ఎన్ని సాధనలు చేసినప్పటికినీ చిత్తశుద్ధి లేకపోతే ఇవన్నీ నిరుపయోగమే. చిత్తశుద్ధి నిమిత్తమై నామస్మరణ చేయాలి. ఈ నామస్మరణ చేత దేనినైనా మనం సాధించవచ్చును. కనుకనే కృతయుగంలో ధ్యానం, త్రేతాయుగంలో యజ్ఞం, ద్వాపరయుగంలో అర్చనం, కలియుగంలో నామస్మరణకు ప్రాధాన్యత యిచ్చారు ఈ నామస్మరణ హృదయపూర్వకంగా చేయాలి. దీనికి మించినది మరొకటి లేదు. భగవంతుని యొక్క సత్యాన్ని గుర్తించాలంటే తపస్సు చేయనక్కరలేదు, తీర్థయాత్రలు పోనక్కరలేదు. ఇంకేవిధమైన సేవలు చేయనవసరం లేదు. ఏ సేవ చేసినా భగవత్ నామాన్ని ఆధారం చేసుకో. కేవలం నాల్గువేలు, ఐదువేలు, ఆరువేలు ఖర్చుపెట్టి ఈపాదుకలు పెట్టుకున్నంత మాత్రమున కాదు ప్రమాణము ఈ పాదుకలు హృదయములోనికి తీసుకోవాలి. భగవంతుడు నా హృదయంలో ఉంటున్నాడని, అతని పాదములే నాయొక్క జీవితానికి మార్గదర్శకము అని భావించాలి. అయితే బాహ్యమైనటువంటివి కూడనూ అవసరమే. అంతర్‌తత్త్వాన్ని గుర్తించేంతవరకునూ బాహ్యము మనకు ఆధారమే. దీనిని ఆధారము చేసుకొని ఆధేయమును మనం పొందాలి. పిల్లవానికి A B C D. లు నేర్పాలంటే మొట్టమొదట అక్షరాలుగా మనం వ్రాయాలి. ఒక కుర్చీని ప్రక్కన పెట్టి, దాని క్రింద 'కుర్చీ' అని వ్రాసినప్పుడే ఆ రూపము మనకు గుర్తుకు వస్తుంది ఈ స్పెల్లింగును నేర్చుకొనే ముందు ఆ రూపమును మనం చూడాలి. ఈ కోర్సును మనం అర్థం చేసుకొనిన తరువాత ఈ రూపాలు మనకక్కరలేదు. అదే విధముగనే దైవత్వమనేటటువంటి దివ్యత్వాన్ని గుర్తించేంతవరకునూ ఈ పాదములు మనకవసరమే. ఈ పాదుకలను ఆధారం చేసుకొని దివ్యత్వమనేటటువంటి ఆధేయాన్ని మనం పొందాలి.

ఈనాడు ఆధ్యాత్మికమంటే అర్థం కాని వారు ఎందరో ఉంటున్నారు. ఆధ్యాత్మికమంటే అపహాస్యం చేసేవారు కూడా ఉన్నారు దీనికి మనం ఏమాత్రం వంగకూడదు, క్రుంగకూడదు వచ్చేటటువంటి నష్టములకు కష్టములకు తట్టుకొని నెట్టుకొని ముందుకు సాగిపోవాలి. అదియే నిజమైనటువంటి మానవత్వము ఇంతశక్తి మానవుని యందు వుండి కూడను తాను మరచిపోయినట్లు నటిస్తున్నాడు ప్రేమతత్త్వాన్ని అందరికీ పంచండి. హృదయం లోపల ప్రేమను నింపండి. ఈ నిండివున్నటువంటి ప్రేమను నిత్యమూ పదిమందికైనా మనం పంచాలి. పంచిన కొలదీ అధికమౌతుందే గాని, తరిగిపోయేది కాదు పెంచుకున్న కొలది ఈ ప్రేమ పెరుగుతుంది దీనిని అదుపులో పెట్టినకొలదీ అది నశించిపోతుంది కనుకనే ప్రేమతత్త్వాన్ని మనం పెంచుకోవాలి ప్రేమ చేతనే ఈ జగత్‌ను ఆనందపరచండి ఈ విధమైన ప్రేమచేత పాదుకలను పూజించి, ఇవి భగవత్ పాదుకలుగా విశ్వసించి, నిరంతరం స్మరిస్తూరావాలి

(ది 8-7-95 ప్రశాంతి నిలయంలో జరిగిన పాదుకా మహోత్సవ సభలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి)

## మనవి

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు 70వ జన్మదినోత్సవ ప్రత్యేక సంచిక (నవంబర్ '95) ను తీసుకొని రావటానికి " శ్రీవాణి " కి ఆశీస్సులు యిచ్చినారు. ఆ ప్రత్యేక సంచికను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దటానికి రచయితలు వ్యాసములు, భక్తులు స్వామివారితో పొందిన అనుభూతులు ది 30-8-95 లోపు మాకు పంపి సహకరించమని మనవి చేస్తున్నాను. - సం.

# స్మరించాలి! ఉచ్చరించాలి! లిఖించాలి!

-భగవాన్ సాయి దివ్యబోధ

" చేతులారంగ శివుని పూజింపలేమి
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువలేమి
దయయు సత్యంబులోన తాతలవలేని
కలుగ నేటికి తల్లుల కడుపుచేటు "

ఈ వ్రాత పోతన వ్రాత అతని హృదయకమలముల యొక్క కూత. వేదత్రయము యొక్క మాట. కర్మ త్రయముయొక్క మూట ఇదియే తరింపగోరేటటు వంటి వారికి రాజబాట మొదటి మాట "చేతులారంగ శివుని పూజింపలేమి?" ఇది కర్మ మార్గము. వేద త్రయములోని ఉపనిషత్తులయందు ఇది ప్రధానమైన పాదము. ఇది భగవద్గీతయందు మొదటి కాండము. " నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువలేమి ?" ఇది రెండవ పాదము ఇది ఉపనిషత్తుల, వేదముల యందు ఉచ్చరించిన భక్తియోగము. ఇదియే భగవద్గీత యందు వర్ణించినటువంటి యొక్క భక్తి కర్మకాండలు " దయయు సత్యంబులోన తాతలవలేని " మనసునందు, వాక్కునందు, క్రియయందు శబ్దబ్రహ్మ మును చింతించటమే మానవునియొక్క ప్రధాన కర్తవ్యము ఇట్టి త్రికరణ శుద్ధితో కూడినటువంటివారే మానవులు. ఉపనిషత్తులయందు 'మానవుడు' అనగా నమ్మకము కలవాడని అర్థము. తాను ఇట్టి విచిత్రమైన మానవజన్మను ధరించికూడనూ, మనము త్రికరణము లను సరియైన మార్గములో ప్రవేశపెట్టక పెడమార్గము నందు ప్రవేశపెట్టి పడరాని బాధలకు ఈనాడు గురి అవుతున్నాము

" హస్తస్య భూషణం దానం
సత్యం కంఠస్య భూషణం
శ్రోత్రంచ భూషణం శాస్త్రం
భూషణైః కిం ప్రయోజనమ్ "

ఇంతకంటె అలంకారములు మనకేం కావాలి ? ఇంతకంటే మనకు ఆభరణములెందుకు ? ఈనాటి ఆభరణములు భయోత్పాదము కల్గిస్తున్నవి. కాని ఈ విధమైనటువంటి ఆభరణములకు మాత్రం ఎట్టి భయమూ లేదు, నిరంతరమూ అభయమే. ఈ అభయాస్త్రమైనటు వంటి భూషణములను మనం ధరించక, భయభ్రాంతు లను కలిగించేటటువంటి భూషణములు ధరించటం వలన నిరంతరమూ జీవితం భయాందోళనలతో క్రుంగి పోతున్నది. కనుక మానవునకు ప్రధానమైనటువంటిది సంకల్పం. సంకల్పం ఎట్టిదో మాట అట్టిది, మాట ఎట్టిదో క్రియ అట్టిదిగా ఉండాలి. ఈ మూడింటియొక్క ఏకత్వమే దివ్యత్వముతో కూడినటువంటి దైవత్వము మాట హృదయమునుండి ఆవిర్భవించేటటువంటిది. ఆ పదము హృదయ సంబంధమైనటువంటిదిగా ఉండాలి. దయతో కూడినటువంటిదే హృదయము. కఠినముగా ఉండేటటువంటిదికాదు. పాషాణంగా ఉండేటటువంటిది అంతకన్నా కాదు. ప్రేమతో కూడినటువంటిది. ప్రేమతో కూడినటువంటి ఈ హృదయము నుండి ప్రేమయే ఆవిర్భవించాలి. అట్టి ప్రేమనే వాక్కు ద్వారా ప్రవహింపజేయాలి. ఈ ప్రవహింపజేసేటటు వంటి 'వాగ్గంగ'ను ఆచరణలో నిరూపించాలి.

పవిత్రమైనటువంటి పరమాత్మకు హృదయమేస్థానము అక్కడనుండి ఆవిర్భవించినటువంటి గంగా సత్యమై నటువంటి ప్రవాహము. ఈ ప్రవాహము ద్వారా పండేటటువంటి పంటలు క్రియా పంట. కనుకనే

'మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనాం' అన్నారు. కాని దురదృష్టవశాత్తు ఈనాడు తలచడం ఒకటి, చెప్పడం మరొకటి, చేయటం ఇంకొకటి. కనుకనే ఈనాడు మానవత్వం మరుగున పడిపోయింది. ఈ మానవత్వాన్ని ప్రకటింపజేయాలన్న, మానవత్వాన్ని అనుభవించవలెనన్న, మానవత్వానికి విలువను కలిగించవలెనన్న ఈ "త్రికరణశుద్ధి" అత్యవసరం. ఇదియే నిజమైనటువంటి 'తపస్సు'. తపస్సు అంటే ఇల్లువాకిళ్ళను, ఆలుబిడ్డలను వదలి అడవులకేగటం కాదు, అది కేవలం 'తపస్సు' అని చెప్పవచ్చును. ఇవి పిరికిపందలు చేసేటటువంటి పని. నిజమైన తపస్సు అంటే మనస్సు, వాక్కు, చేతలను ఏకం చేయటం. ఇదియే తపస్సు, ఇదియే అహింస, ఇదియే త్యాగం, ఇదియే శాంతం, ఇదియే సత్యం - సర్వమూ ఇదియే. కనుకనే ....

"సత్యతత్త్వమునుండి సర్వంబు సృష్టించె
సత్యమున అణగె సర్వసృష్టి
సత్యమహిమ లేని స్థలమేమి కనుగొన్న
సత్యమదియె చూడరన్న"

కనుక సత్యమే ఈ జగత్ స్వరూపము. సత్యమే భగవత్ స్వరూపము, ఈ భగవత్ స్వరూపముయొక్క బింబ ప్రతిబింబమే మానవత్వము. దివ్యత్వమనగా భగవంతుని యొక్క ఈశ్వరత్వమే, ఈశ్వరత్వము యొక్క ప్రతిబింబమే. శరీరముయొక్క ప్రకాశమే మానవత్వము. ఈశ్వరుని నుండి ఆవిర్భవించిన మానవుడు ఈశ్వర గుణములనే కలిగి ఉంటాడు. కనుకనే ఈశ్వరత్వాన్ని ప్రకటించే నిమిత్తమై మూర్తీభవించినటువంటి వాడే మానవుడు. కాని ఈనాడు ఇలాంటి ఈశ్వరత్వ గుణములను విస్మరించి, దానవత్వ గుణములను విజృంభింప జేసుకొని, మానవత్వమును మరుగు పరచుకుంటున్నారు.

దివ్యాత్మస్వరూపులారా!

మనం మొట్టమొదట మానవత్వం అంటే ఏమిటో గుర్తించాలి. సామాన్యమైనటువంటి జంతుజాలము అన్నియూ కూడనూ, మానవునివలె తిరిగి తిరిగి సుఖ భోగములను అనుభవిస్తున్నాయి. ఇక మానవత్వములో వుండినటువంటి విశిష్టత ఏమిటి? మానవత్వంలో దివ్యత్వాన్ని ప్రకటింపచేసేటటువంటి దైవత్వమున్నది. తినటం, త్రాగటం, నిద్రించడం, భోగ భాగ్యములను అనుభవించడం మాత్రమే కాదు. 'దైవం నరాణాం అధికం విశేషః, జ్ఞానేన హీనాః పశుభిః సమానాః' ఏమిటి ఈ జ్ఞానము? ప్రపంచం సర్వమూ జ్ఞానమయమే. ఇది ఒక గ్లాసు, ఇది జ్ఞానమే. ఇది ఒక బట్ట, ఇది జ్ఞానమే. భౌతికమైన పదార్థములను ప్రబోధించేటటువంటిదంతా జ్ఞానమే. ఇది కంటికి కనిపించేటటువంటిది, చెవులకు వినిపించేటటువంటిది, మనసుకు అనిపించేటటువంటిది, హృదయాన్ని కరిగించేటటువంటిది. ఇది కాదు మనం తెలుసుకోవలసిన జ్ఞానం, ఆత్మజ్ఞానమును గుర్తించాలి. ఆత్మ అనగా ఏమిటి? సర్వత్రా ఉండినటువంటి చైతన్యమే 'ఆత్మ'. ఈ చైతన్యమనేటటువంటిది సర్వులయందునూ ప్రకటితమవుతుంటుంది. నిత్యజీవితంలో ఈ సత్యమును గుర్తించవలెననిన చక్కని ఒక ఉదాహరణ. ఈ చైతన్యం ఈ దేహంలో ఉండినంతవరకు ఇది 'శివం .... శివం ....' అన్నారు. ఈ చైతన్యం ఎప్పుడు ఈ దేహం నుండి వదలిపోతుందో అప్పుడు 'శవం .... శవం ....' అయిపోతుంది. చైతన్యము కలిగినదే 'శివం'. చైతన్యము లేనటువంటిది 'శవం'. సర్వత్రా ఉండినటువంటిదే ఈ చైతన్యం. కాని ఈనాడు ఇట్టి చైతన్యమును గుర్తించటానికి ప్రయత్నించటంలేదు. కనుకనే 'మద్భక్తః మత్కర్మః' నా కర్మలను నీవు ఆచరించు. నీవు నా భక్తుడవు కావాలనుకున్నప్పుడు నా కర్మలు ఆచరించు. సర్వ కర్మలు కూడనూ భగవత్ ప్రీతిగానే భావించు. నీవు తపములు, జపములు, ధ్యానములు ఏదియును

చేయనక్కరలేదు అసలు చేయకూడదని చెప్పటం లేదు. కాని నిజమైనటువంటి జపము హృదయమునుండి ఆవిర్భవించాలి. ఏది హృదయములో పుట్టినదో, దానిని నోటితో పలకాలి నోటితో పలికినటువంటి దానిని చేతితో వ్రాయాలి ఇదియే నిజమైనటువంటి 'లిఖిత జపము' కాని ఈనాడు హృదయములో తలంచక, మాటతో చెప్పక, చేతితో మాత్రం వ్రాస్తుంటారు. 'లిఖిత జపము' వ్రాసే సమయము లోపల మనసులో స్మరించాలి. దానిని నాలుకతో ఉచ్చరించాలి, ఉచ్చరించిన దానిని, హస్తముతో లిఖించాలి. దీనినే త్రికరణ శుద్ధితో వ్రాసిన "లిఖితజపము" అంటారు కొంతమంది 'రాం, రాం, రాం' అని మూడు పదములు వ్రాస్తారు ఆ విధంగా కోటి పదములు వ్రాయాలంటే చాలా కాలం పడుతుందికదా ! ఈ కోటి నామములు త్వరగా ముగించాలనే ఉద్దేశ్యంతో కార్బన్ పేపర్లు పెట్టి వ్రాస్తుంటారు మరికొంతమంది స్టెన్సిల్ తీస్తారు కోట్లాది నామములు కొన్ని గంటలలో తయారు చేస్తారు ఇది కాదు 'లిఖిత జపము' హృదయములో ప్రింటు అయిపోవాలి

చాలామంది మహిళలు 'లిఖితజపం' చేస్తుంటారు. ఒకవేళ వారికి వ్రాయటానికి అవకాశం చిక్కనప్పుడు ఇల్లు ఊడుస్తూ ' నా హృదయాన్ని పరిశుద్ధం చేసుకుంటు న్నాను .. నా హృదయాన్ని పరిశుద్ధం చేసుకుంటున్నాను' అనే భావంతో నీ ఇల్లు శుభ్రం చేసుకో ! చపాతీలు చేస్తూ ' నా హృదయాన్ని విశాలం చేసుకుంటున్నాను' అనే పవిత్రమైన భావంతో చపాతీలు చేయి ! కూరలు తరుగుతూ 'నాలోని చెడ్డ సుగుణములను తరిగి తరిమి వేస్తున్నాను' అని భావిస్తూ చెడ్డ (పుచ్చు) ముక్కలను పారవేయి! మంచి ముక్కలను జలములో వేసేటప్పుడు పరమాత్మని ప్రేమలో వీటిని వేస్తున్నానని భావించు. పొయ్యిలోమంటపెడుతూ ఇది Wisdom Power (జ్ఞాన వెలుగు)అని భావించు జ్ఞానమనే అగ్నితో వీటిని సంస్క రింపచేసుకో ! ఈ విధంగా నిత్య జీవితంలో తెల్లవారు మొదలు రాత్రి పరుండువరకు చేసే సర్వ కర్మలు కూడనూ దైవకర్మలుగానే మనం భావించవచ్చును. అట్లు కాకుండా ప్రాకృతమైన కర్మలుగా భావించుకుంటే ఇవన్నీ వ్యర్థమైనవే అవుతాయి. కనుక పవిత్రమైన భావంతో నిస్వార్థంగా ఏ పని చేసినా అది జపమే అవుతుంది జపములు చేయనవసరంలేదు, ధ్యానము చేయ నవసరంలేదు, కర్తవ్య కర్మలను విసర్జించ నవసరం లేదు సర్వ కర్మలూ దైవభావంతోనే చేయి. ఇదే నిజమైనటువంటి భక్తి లక్షణం

ఈనాడు ప్రపంచం అనేక అశాంతులతో కుమిలి పోతున్నది. దీనికి మూలకారణమేమిటి ? ఆత్మ విశ్వాసమును కోల్పోవటమే దీనికి మూలకారణము దేహాభిమానమును పెంచుకుంటున్నామే కాని, ఆత్మాభిమానమును పెంచుకోవటం లేదు. దేహము అశాశ్వతము ఇది నీటి బుడగలాంటిది. ఏ క్షణంలో మాయమవుతుందో ఎవరికీ తెలియదు. మనస్సు పిచ్చి కోతి. కనుక మనస్సును మనం అనుసరించకూడదు. దేహమునూ అనుసరించకూడదు. హృదయాన్ని మాత్రమే అనుసరించాలి మనసు అనేది కోరిన తక్షణమే ఏ కార్యమైనా చేయాలని శరీరం సిద్ధ పడుతుంది అంత త్వరగా ఆ కార్యములో ప్రవేశించ వద్దు కొంతకాలమును తీసుకో. ఇది మంచిదా ? చెడ్డదా ? చేయదగినదా ? చేయదగనిదా ? అని కొంత విచారణ సలుపు ఆ విచారణే బుద్ధియొక్క తత్త్వము. అట్టి విచారణ జరిపి 'అది మంచిదే' అని హృదయానికి పరిపూర్ణ తృప్తి కలిగినప్పుడు సేవాకార్యమును ప్రారం భించు. ఈ విధంగా కాలము తీసుకొని విచారణ సలిపి నప్పుడు సత్ కర్మలను మనం ఆచరించడానికి అవకాశం ఏర్పడుతుంది

మానవునికి చతుర్విధపురుషార్థములున్నవి. అవే ధర్మ అర్థ కామమోక్షములు. ప్రాచీన కాలము నుండి మనవారు ప్రతి దానిని ధర్మముతో ముడిపెస్తూ వచ్చారు ధనమును ధర్మబద్ధంగా సంపాదించాలి.

ధర్మమైనటువంటి కోరికలనే పెంచుకోవాలి. అర్థ కామములు రెండూ ధర్మమునను సరిస్తే మోక్షం సహజంగా లభిస్తుంది ఈ ధర్మమే సర్వ మార్గములను కలిగింపజేస్తుంది. మార్పులను కూడా కలిగింపజేస్తుంది. సముద్రములో జలం ఉప్పగా ఉంటుంది. సూర్యరశ్మి చేత ఆ జలం ఆవిరిగా మారుతుంది. ఆవిరిలో ఈ ఉప్పు పోయి తీయని రూపం చెందుతుంది. అదియే మేఘము లుగా కూడుతుంది తిరిగి వర్షంగా మనకు యిస్తుంది. నదులుగా రూపొందుతాయి. కనుక మన 'బుద్ధి' అనేటటువంటి సూర్యుడు, అనుగ్రహమనేటటువంటి సాగరంపైబడాలి ఈ అనుగ్రహమనేటటువంటి జగత్ సాగరమునుంచి క్రమక్రమేణ మాధుర్యమనేటటువంటి రూపకంగా బయలుదేరుతుంది అదియే సత్యమైనటువంటి మేఘము. ఈ సత్యమనే మేఘము నుండి 'ప్రేమ' అనేటటువంటి వర్షబిందువులు వస్తాయి. ఈ ప్రేమ బిందువులు ఏకమైనప్పుడే ఆనందమనే ప్రవాహం ఏర్పడుతుంది ఈ ఆనందమనే ప్రవాహం తిరిగి ఆ యొక్క అనుగ్రహమనే సాగరంలో నే తానైపోతుంది. ఇది పుట్టటం సముద్రంలో, తిరిగి చేరటం సముద్రంలో.

చాలామంది భక్తులు స్వామివద్దకు వచ్చి నాకేమైనా మార్గము చూపించమని కోరుతుంటారు 'ఒరే పిచ్చివాడా! కొత్తమార్గములు నీకు అవసరంలేదు ఎచ్చిన మార్గమునె నడచుకొనివెళ్ళు ఎక్కడినుండి వచ్చావో, అక్కడికి వెళ్ళు. ఎందుకు కొత్తమార్గం? ఆత్మ నుంచి వచ్చావు, తిరిగి ఆత్మను చేరుకోవటానికే ప్రయత్నించు ఉదాహరణకు ఇక్కడకు తూ॥గో, ప॥గో, కృష్ణా, గుంటూరు జిల్లాలన్నింటినుంచి వచ్చారు. ఇక్కడ ఆనందంతో గడిపినప్పటికిని తిరిగి స్వస్థానమునకు చేరక తప్పదుగదా! అదే విధముగా పనిమీద ఒకడు పట్టణానికి వెళ్ళాడు Five star హోటల్‌లో దిగాడు. ఆనందంగా గడిపాడు. పని అయిన తరువాత తిరిగి స్వగ్రామమునకు వెళ్ళక తప్పదుగదా! పట్టణంలో ఆనందంగా వున్నద కొబట్టి తన గ్రామమునకు వెళ్ళటం మానుకుంటాడా? జేబులో డబ్బులున్నంతవరకు అక్కడ ఉండగలడు. తరువాతైన గ్రామానికి వెళ్ళక తప్పదు! ప్రతి మానవుడు కర్మక్షేత్రయాత్రికుడు. మనం తీర్థయాత్రలకు వెళ్లుతున్నాం. ఎన్ని యాత్రలు చేసినప్పటికినీ తిరిగి స్వస్థానం చేరక తప్పదు. అదియే మన యొక్క స్వ .... స్థానము : 'స్వ' అనగా ఆత్మ. అదియే ఆత్మస్థానము. అనేకమంది భావిస్తుంటారు. నాకు స్వాతంత్ర్యం వచ్చిందని ఇష్టమువచ్చినట్లు చేయవచ్చునని తలుస్తుంటారు. ఇది ఒక విధమైన అహంకారమే. ఏమిటి ఈ స్వేచ్ఛ. స్వ + ఇచ్ఛ = స్వేచ్ఛ. స్వ అనగ ఆత్మ. ఆత్మ ఇచ్ఛనే స్వేచ్ఛ. ఇలాంటి భావములను, అర్థములను గుర్తించుకోలేని వ్యక్తులే, అనేక విధముల పెడమార్గముల పట్టి ఈ భౌతికమైన సుఖసంతోషములకు లోబడిపోయి నిత్య సత్యమైన మార్గమును మరచిపోతున్నారు.

ప్రేమస్వరూపులారా!

మీరు అనేక శ్రమలకోర్చి, ఎంతో భక్తిశ్రద్ధలతో ప్రశాంతినిలయంలో ప్రవేశించి, ఇక్కడ ఏ సదుపాయములు లేకపోయినప్పటికినీ, అన్నీ భరించుకొని, తట్టుకొని, నెట్టుకొని ఆనందముతో ప్రవేశిస్తున్నారు. ఈ భావములే చిత్తమునందు భద్రపరచుకోవాలి. ఇక్కడ ఈ సమావేశంలో ఇన్నివేలమంది ఉన్నారు. ఇది ఎంతసేపు కొన్ని గంటలు లేక కొన్ని దినముల కాలము కాని నీవు తిరిగి నీ స్వస్థానమునకు వెళ్లిన తరువాత దీనిని చింతించుకో. నీవు ప్రస్తుతం ఈ ప్రశాంతి నిలయ ఆవరణలో ఉంటున్నావు. వ్యక్తిగతంగా ఇప్పుడు నీవు ఈ ఆవరణలో వుంటున్నావు. కాని నీ ఇంటికి వెళ్ళి ఈ దృశ్యాన్నంతా చింతించినప్పుడు ఈ ఆవరణమంతా నీలో వచ్చి వుంటున్నట్లుంటుంది. కొబట్టి సృష్టి అంతా ఎక్కడ ఉంటున్నది? సృష్టి అంతా మన దృష్టిలోనే ఉంటున్నది కనుక మన దృష్టి సరియైన దృష్టిగా అభివృద్ధిగావించుకోవాలి. ఈ దృష్టిని మనం సక్రమమైన మార్గంలో వుంచుకొనినప్పుడు, సృష్టి అంతా చక్కనైపోతుంది. కాని ఈనాడు ఈ

సృష్టిలోపల అన్యాయ, అక్రమ, అనాచార అసత్యమంతా ఆవిర్భవిస్తున్నాయని, అభివృద్ధి అయిపోతున్నాయని, విలయతాండవం చేస్తున్నాయని మనం విచారిస్తున్నాం సృష్టిని మనం మార్చ నవసరం లేదు మన దృష్టిని మార్చుకుందాం ఈ సృష్టి అంతా కూడనూ భగవంతుని యొక్క సృష్టి దీనిని మార్చడానికి ఎవరి తరమూ కాదు ఈనాడు ప్రపంచ మును ఆవరించిన అశాంతిని దూరం చేయాలంటే ఒక్క 'భగవచ్చింతన' తప్ప వేరొక మార్గములేదు కనుక ఎన్ని పదవుల నేలినప్పటికినీ, ఎంత ధనం సంపాదించి నప్పటికినీ మనం పొందవలసినది పొందలేకపోతున్నాం "కారే రాజులు రాజ్యముల్ గల్గరే గర్వోన్నతిన్ పొందరే వారేరి?" అందరూ వచ్చి పోయేటటు వంటి మేఘములవంటి వారే ఇది జగత్, జగత్ అంటే అర్థమేమిటి 'జ' రావటం, గత్ పోవటం. రావటం పోవటమే, ఏదీ శాశ్వతం కాదు దైవత్వమొక్కటే శాశ్వతం అట్టి శాశ్వతమైనటువంటి దానిని మన హృదయంలో ప్రతిష్ఠింపజేసుకొని, నిత్య జీవితంలో మన కర్తవ్యాన్ని ఆచరించుకుంటూ. పరోపకార చింతనతో మన జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. 18 పురాణములు వ్రాసిన వ్యాసుడు "అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనం ద్వయం" రెండు పదములలోనే పురాణముల సారమంతా సూచించాడు ఏమిటది? "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం" మనం ఇతరులకు ఉపకారం చేయాలి. అపకారం చేయకుండా ఉండాలి. ఉపకారం చేయటానికి అవకాశం లేకపోతే అపకారం మాత్రం చేయకుండా ఉండటమే పెద్ద ఉపకారం కనుక మానవుడు చేయవలసినటు వంటిది ఉపకారం .... ఉపకారం

"శరీర మాద్యం ఖలుధర్మ సాధకమ్" ధర్మము నాలుగు పాదముల అభివృద్ధి కావాలని నారాయణరావు (గుంటూరు) కోరాడు ఈ ధర్మమనేది ఎక్కడ ఉంటున్నది? మన ప్రవర్తనయందే ఉంటున్నాది, మన ఉపకారమునందే ఉంటున్నాది, మన నడతలయందు, మన వాక్కులయందు మన తలంపుల యందే ఉంటున్నది. ధర్మమంతా మన హృదయము నందే ఉంటున్నది. కనుక మన హృదయమునందు ఆవిర్భవించినట్టి భావాన్ని వాక్కులో ఉచ్చరించటమే ధర్మము వాక్కుయందు ఉచ్చరించిన దానిని క్రియలో ఆచరించడమే ధర్మము. వీటన్నిటికిని ప్రేమయే ప్రధానము ప్రేమ అనేటటువంటి దానిని కర్మలో ప్రవేశపెట్టినప్పుడు అది ధర్మమే అవుతుంది. ప్రేమ అనే దానిని వాక్కులో ప్రవేశపెట్టినప్పుడు అది సత్యము అవుతుంది ప్రేమను ఆలోచనలో పెట్టినప్పుడు అదియే హృదయ ధర్మమవుతుంది. అదే శాంతిగా మారుతుంది అందరియందును వున్న ప్రేమ ఒక్కటేనని మనం అర్థం చేసుకొనినప్పుడు అదియే అహింసగా మారిపోయింది అన్నింటికినీ ప్రేమయే ప్రాణము. ప్రేమలేకపోతే ఈ జగత్తులో ఒక్క క్షణమైన జీవించలేము ఎన్నో రకముల Sweets మనం చేసుకుంటున్నాం, తింటున్నాం వీటి పేర్లు, రూపములు వేరువేరుగా ఉంటున్నాయి. కాని వాటిల్లోని చక్కెర ఒక్కటే అదే రీతిగా దైవం ఒక్కడే రూపనామములు వేరు కావచ్చును. "ఏక ప్రభువుకా అనేక్ నాం" అని భజన చేస్తుంటాం ఇక్కడికి అనేక ఆభరణాలు తెచ్చారు కంకణం, కౌస్తుభమాల, స్ఫటికమాల, కిరీటం పేర్లు రూపములూ వేరైనా అన్నిటియందున్న బంగారం మాత్రం ఒక్కటే. కనుక దైవత్వం ఒక్కడే

కనుక అట్టి ఒక్కడైన దైవత్వాన్ని మన హృదయంలో ఎవరికి ఏ పేరు నచ్చిన ఆ రూపంలో స్మరించవచ్చును ఏసు, రామ, అల్లా, కృష్ణ, హరి, హర — అన్ని పేర్లు రెండు అక్షరములే 'సాయి' కూడా రెండు అక్షరముల పదమే అన్నీ రెండు అక్షరములతోనే చేరిపోయినాయి కాబట్టి ఈ రెండు అక్షరముల పదమును ఎవరైనా ఉచ్చరించవచ్చును. ఏ భేదమూ లేదు. ముల్లోకములకునూ సమానమైనటువంటివే

ప్రేమస్వరూపులారా !

ఈనాడు 'లోకాస్సమస్తా సుఖినోభవంతు' అనే ప్రార్థన ఫలించాలంటే ఆత్మవిశ్వాసమును పెంచుకోవాలి. దైవత్వాన్ని విస్మరించరాదు దైవమే లేకపోతే జగత్తే లేదు దారమే లేకపోతే వస్త్రమే కాదు వెండే లేకపోతే గ్లాసే కాదు అదే రీతిగా దైవమే లేకపోతే సృష్టే లేదు ప్రశాంతినిలయంలో చాలా ఆనందంగా ఉంటున్నదంటారు చాలామంది. ఈ ఆనందమనే పదమును ఉచ్చరిస్తున్నావుగాని, ఈ ఆనందమునకు రూపమేమిటి? దీనికి రూపంలేదు కాబట్టి 'నేను నమ్మను' అంటాడు నాస్తికుడు ఆనందానికి రూపంలేదు గాని అనుభవం ఉంటున్నాది. పుష్పం సుగంధాన్ని అందిస్తుంటుంది. సుగంధానికి రూపం లేదుగాని, సుగంధాన్ని అందించే పుష్పమునకు మాత్రం రూపం ఉన్నది ప్రేమకు రూపంలేదు కాబట్టి నేను నమ్మనంటాడు ఒక మూర్ఖుడు 'ప్రేమకు రూపంలేదుగాని, ప్రేమించే తల్లికి మాత్రం రూపం ఉన్నది' నా మనస్సు చాలా విచారంగా ఉన్నది అంటాడు ఒక నాస్తికుడు. ఈ మనస్సును నీవు చూడగలుగుతున్నావా? చూడనటువంటి మనస్సును గురించి ఎట్లా చెప్పగలుగుతున్నాడు? మనస్సుకు ఏదైనా రూపం ఉన్నదా! రూపం లేనటువంటిదానిని గురించి ఎట్లా చెప్పగలుగుతున్నాడు? నీకు అవసరమైన దానిమీద విశ్వాసం. అవసరం లేనటువంటిదానిమీద అవిశ్వాసం ఇది వ్యక్తిగతమైన సంబంధమేగాని, సమిష్టి స్వరూపంలో ఈ భేదములకు అవకాశమే లేదు, మానవుడు సమిష్టి స్వరూపుడేగాని వ్యక్తి స్వరూపుడు కాదు.

సాధన.... సాధన.... అంటున్నారు. ఏమిటి ఈ సాధన? జపం చేస్తున్నారు కళ్ళుమూసుకొని. అరగంట సేపు కూర్చుంటున్నారు అరక్షణమైనా మనస్సు నిలుస్తున్నదా? నిలవటంలేదే జపమాల పుచ్చుకొని కండ్లు మూసుకుంటున్నారు. మనస్సు మాత్రం మార్కెట్టుకు పోతున్నది. ఇలాంటి జపములతో కాలం ఎందుకు వ్యర్థం చేయాలి? కాలం భగవత్ స్వరూపం కాలమును వ్యర్థం చేయకుండా కర్మలచేత సార్థకం గావించుకోవటమే నిజమైన సాధన

'జంతూనాం నరజన్మ దుర్లభమ్' దుర్లభమైన మానవజన్మను సార్థకం చేసుకోవాలి. పవిత్రమైనటువంటి మానవజన్మను అపవిత్రం చేసుకోరాదు. ఎవరిని నొప్పించేటటువంటి పలుకులను మనం ఉచ్చరించరాదు. ఇతరులను ఆనందపరచేటటువంటి పలుకులను ఉచ్చరించండి! అదియే మనం చేయవలసిన సాధన. ఒకరు ఎవరైనా మనల్ని దూషించారా! సరే దూషించుకోనియి. నేను తిరిగి అతనిని దూషించాలి? నీవు కూడా అతనిని దూషిస్తే, నీవు అతనితోపాటు సమానమైనావు గదా! నీ అధికత్వమేమిటి? కనుక నీవు దానిలో అధికులుగా వుండాలి ఎవరేమి చెప్పినా కాని ఏమైనా చెప్పుకొని, అది ఆయన ఇష్టం. కాని నా ప్రతిజ్ఞ మాత్రం శాంతమును సంపాదించుకోవటం శాంతస్వభావంగల వానిని జయించగల శక్తి ఈ జగత్తులో వేరొకటి లేదు.

## సాయి కుళ్వంత్

మీరందరూ ఎట్టి ఎండావానలకు ఇబ్బందిపడకుండా కూర్చోవడానికి ఈవిధమైన భవనాన్ని నిర్మించగలిగినాము. ఇలాంటి భవనమును నిర్మించడానికి హృదయపూర్వకంగా, ఎంతో ప్రేమతో, ఒకే ఒక వ్యక్తి సహకారం అందించాడు అతనికి ఒక పర్యాయం గుండెపోటు (Heart Attack) వచ్చింది. ఢిల్లీలో All India Institute of Medical Sciences లో ఆపరేషన్ జరిగింది ఆపరేషన్ జరిగినప్పటికి ఆయన స్థితి ప్రమాదస్థితికి పోయింది అలాంటి పరిస్థితులలో అమెరికాకు గాని, లండన్‌కుగాని తీసుకొని వెళ్ళితే మంచిదని డాక్టరు సలహా యిచ్చారు. అయితే ఆయన కదిలించే స్థితిలో లేడు ఆనాడు అతని పరిస్థితిని డా॥ వేణుగోపాల్ నాకు వివరించగా, అతనిని అమెరికా గాని.లండన్‌గాని పంపనవసరంలేదు అతనే కోలుకుంటాడని చెప్పాను అంతే.... అతని ఆరోగ్యం కుదటపడింది. ప్రశాంతినిలయం వచ్చాడు స్వామి పాదాలపై బడి ఏదో ఒక మంచి కార్యం చేయడానికి అవకాశమిప్పించమని ప్రాధేయపడ్డాడు, రెండుకోట్ల రూపాయలు

యిచ్చాడు. అతనే "బల్వంతరాయ్" అందరికీ ఆ త్యాగభావం రాదు ధనవంతులు లోకంలో ఎందరు లేరు? కాని అతనికి ఆ త్యాగభావం వచ్చింది. త్యాగ భావం కూడా ఒక అదృష్టమే. ఎన్ని జన్మల పుణ్యమో ఈ త్యాగభావం రావటం త్యాగంతోనే ఉన్నది క్షేమం. మనం ఒక ప్రక్క భుజిస్తున్నాం. భుజించిన దానిని మరొకవైపున త్యాగం (మలం రూపంలో బయటకు పంపిస్తున్నాం) చేయకపోతే కడుపు చెడిపోతుంది ఒక వైపున గాలి పీలుస్తున్నాము. పీల్చిన గాలిని మరొక వైపు వదలకపోతే మన ఊపిరితిత్తులు చెడిపోతాయి రక్తం ప్రసరిస్తుంటుంది ప్రసరించక నిలిచిపోతే అక్కడ కురుపు మాదిరిది తయారై బాధ పెడుతుంది రక్తం కదిలిపోతుంటేనే ఆరోగ్యకరంగా ఉంటుంది. కనుకనే 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' అలాంటి త్యాగపురుషులు, యోగపురుషులు భారతదేశంలో లేక పోలేదు. కనుక ఎవరి శక్త్యానుసారము వారు ఎక్కడైనా సరే, ఎవరికైనాసరే త్యాగం చేయటం మంచిది. కనుకనే ఈ భవనమునకు 'సాయి కుల్వంత్' అని పేరు పెట్టారు. ఇంతకు పూర్వం పూర్ణచంద్రకమానీ పిల్లర్ లేకుండా పెద్ద హాలు నిర్మించాలని తలపెట్టి ఇరాన్ నుంచి ఇంజనీర్లను పిలిపించి, తన స్వంత డబ్బుతో పెద్ద హాలును నిర్మించాడు. అదే 'పూర్ణచంద్ర హాల్' ఆదేవిధముగా బెంగుళూరులో రమేష్ అనే వ్యాపారస్థుడు యావత్ డబ్బును వెచ్చించి పెద్ద హాల్‌ను నిర్మించాడు. అదే సాయి 'రమేష్ హాల్'. భోపాల్‌లో 'సత్యసాయి కాలేజి' ఉన్నది దీనిని అర్జున్‌సింగ్ చక్కగా ఏర్పర్చాడు అతనే దాని ఖర్చునంతా భరించాడు. ఇలాంటి త్యాగపురుషులు భారతదేశంలో కోకొల్లలు. బీదలను ఆదుకొని, వారి బాధలను తీర్చి, వారికి తగినటువంటి సదుపాయములనుచేసి, మన సేవలను సార్థకం గావించుకోవాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

(ది 9-7-1995 న ప్రశాంతినిలయంలోని 'సాయి కుల్వంత్' హాల్‌లో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగమునుండి)

## శ్రీవాణి భగవాన్ బాబావారి ఆశీస్సులు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి 70 వ జన్మదినోత్సవ సందర్భమును పురస్కరించుకొని నవంబర్ '95 లో ప్రత్యేక సంచికను తీసుకొనిరావాలనే సంకల్పంతో, భగవాన్ బాబావారి ఆశీస్సులు పొందడానికి పుట్టపర్తి వెళ్ళాను. ది 14-7-1995 న ఉదయం స్వామివారి అనుగ్రహం కోసం, ప్రత్యేక సంచిక కవరుపేజీ మీద మల్టీ కలర్‌లో ముద్రించ సంకల్పించుకొని, స్వామివారి ఫోటోను చేతితో పట్టుకొని కూర్చొనినాను. ఉదయం షుమారు 7 గంటల ప్రాంతంలో స్వామి నావద్దకు రాగా "శ్రీవాణి ప్రత్యేక సంచిక (నవంబర్ '95) కు తమ దివ్యాశీస్సులు పొంది పనిని ప్రారంభించ వచ్చాను" అని చెప్పి స్వామివారికి ఆ ఫోటోను చూపగా "చేసేయి! చేసేయి!" అంటూ నవ్వుతూ విభూతిని సృష్టించి ఫోటోమీద పోశారు. అప్పుడు నాకు కలిగిన ఆనందోత్సాహములను వర్ణించడానికి మాటలు చాలవు. ఆ అనుభూతి వర్ణనాతీతము. స్వామివారు ఇచ్చిన దివ్యాశీస్సుల ప్రభావంతో నవంబర్ '95 స్వామివారి 70 వ జన్మదిన ప్రత్యేక సంచికను సర్వాంగ సుందరంగా పాఠకులకు సమర్పించుకోగలను.

శ్రీ సత్యసాయిబాబాయ నమః

# మనవి

భగవాన్ సత్యసాయిబాబావారి 70 వ జన్మదినము సందర్భముగ స్వామియొక్క దివ్య సంకల్పముతో వ్రాయబడిన 99 పుస్తకములను ముద్రించ సంకల్పించుకుంటిని. ఎంతో ప్రేమతో అక్షరమక్షరమును అపురూపముగ కూర్చించి అనంతప్రేమను చూపిన శ్రీ స్వామి వారి దివ్యచరణసేవకు వినియోగమైన జన్మగ ఆధ్యాత్మికమైన విషయాలతో పద్యములుగ, పాటలుగ, వచనముగ స్వామితోగల అనుబంధ మాధుర్యాన్ని కొల్లడించే భాగ్యము నాకు కల్గినది. అందులో భాగస్వాములు కావాలని స్వామి చరణసేవ పదసేవగ చేయాలని భక్తి శ్రద్ధలనే సిరిసంపదలతో తులతూగే మిత్రులు ముందడుగువేసి ఒక పుస్తకము - 999 ప్రింటింగ్ పుస్తకములుగ ముద్రణ చేయించ పూనుకుంటే, వారి అడ్రసుకు వ్రాతప్రతిని పంపగలను. 99 పద్యములు, 99 పాటలు, వచనములకు వరుసగా అచ్చు ఖర్చు షుమారుగా రూ.1500/-, రూ. 3000/-, రూ. 3000/- అక్షరయజ్ఞములో మీరు పాల్గొని స్వామికి ఆనందాన్ని కలిగించే ఆధ్యాత్మిక విద్యను వెలుగులోనికి తేగలరని ఆశిస్తున్నాను.

ఇంటికో పువ్వు ఈశ్వరునికొక మాలగా రూపొందిన రీతిగ అక్షరయజ్ఞాన్ని లక్ష పుస్తకముల పూజలో మీకు తోచిన రీతిగ సహకరించగలరని భావిస్తున్నాను. దివ్యప్రసాద ముగ స్వామి కార్యక్రమమును కొనసాగింపచేసిన విజయవాడ కృష్ణవేణి రెసిడెన్షియల్ కాలేజి స్థాపకులైన శ్రీ చిగురుపాటి వరప్రసాద్‌గారి దంపతులకు నా కృతజ్ఞతలు. వారు ఎంతో విశ్వాసముతో డబ్బును అందించి ముద్రణ బాధ్యతను నాకు అప్పగించారు. ముద్రణ చేసే అవకాశము లేకున్న ఈ క్రింది అడ్రస్సుకు డబ్బును పంపినవారి పేరుతో ముద్రణ చేయించ గలను. నవంబర్ 1 వ తేదికి పుస్తకములు "ముసునూరు" కు చేర్చాలి. డబ్బు పంపినచో ముసునూరు స్టేట్ బ్యాంక్‌కు డ్రాఫ్టు పంపవచ్చును.

చిరునామా  కోగంటి రమాదేవి
W/O కృష్ణమోహన్‌రావు
ముసునూరు - 521 207, కృష్ణాజిల్లా

ఇట్లు
సాయి రమాదేవి

---

గమనిక : పుస్తకములు స్వామివారికి సమర్పణ చేయటము జరుగుతుంది. సత్సంకల్పముతో సహకరించ గల మిత్రులకు నా కృతజ్ఞతలు.

# భగవంతుడు భారతవనిలో అవతరించాడు

— శ్రీ ఆర్. కె. కరంజియా

( అనువాదము : డా॥ రాపర్ల జనార్ధనరావు )

(గత సంచిక తరువాయి)

ఆర్. కె. : అయితే తాము దాల్చిన ఈ మూడు అవతారముల (షిర్డీబాబా, సత్యసాయి, ప్రేమసాయిబాబా) పవిత్ర ఆశయము లేవి ?

బాబా : మానవజాతిని అంతను ఒకే కుటుంబముగ, ఒకే జాతిగ దైవత్వము కల్గినవారుగ రూపొందించుటయే ఆత్మదర్శనమనిన అదియే. ప్రతి స్త్రీ, పురుషుని యందును విశ్వాత్మ సంభూతమైన శక్తి నెలకొల్పబడి యుండును ఇదియే మూల భావన ఈ సర్వాత్మ దర్శన భావము ఒకసారి మనసునందు నిశ్చయమగునో, అప్పుడు పరమాత్మ సంభూతమైన సంస్కృతి, మానవుని తోటి మానవునితో అనుసంధించెడి దివ్య ప్రేమయనెడు తేజము కల్గించి విశ్వమునకు బాటలు వేయును

మొదటిగ మానవుడు, 'మానవ సంతతి' యనెడు భావము పొందవలయును అప్పుడే ఆతనికి సంఘటిత మైన విశ్వభావన బీజరూపమై వెలుగొందును నేటి కాలమున 'మానవ సంతతి' యనెడు భావము మృగ్యమై యున్నది మానవుని భావములకు, మాటలకు చేతలకు ఎట్టి పొంతము కన్పడుటలేదు. కావున నేటి మానవు డెల్లున్నాడు గందరగోళముతో, అనిశ్చయముతోడ, భిన్న భావములు మనమున మార్మోమ్రతలిడుచుండ జీవించుచున్నాడు ఆతనియందు మంచి భావములు, మంచి మాటలు, మంచి చేష్టలు మానవత్వమును తెల్పునవి ఒకించుకయును కానరావు అట్టి వానిని దైవోన్ముఖునిగ జేసి, త్రికరణశుద్ధి కల్గినవానిగ అనగా మాటలు, తలపులు, చేష్టలయందు పొంతనము కలిగిన వానిగ చేయవలయును

## ప్రేమ ఆరాధనలు కల్గిన దేవదూత

ఈ ప్రాథమిక భావసిద్ధాంతము మానవునికి, తన కుటుంబము, పాఠశాల, కాలేజి సంఘము తన నగరము, రాష్ట్రము, దేశము, ప్రపంచమందలి దేశముల ద్వారా తెలియజెప్పబడునో, అప్పుడాతనికి విశ్వమందలి మానవులందరు ఒకే కుటుంబమునకు చెందిన వారనెడు విశ్వభావన పెంపొందును ఏసుక్రీస్తు అందరూ ఒకటే, అందరూ నీవారని భావించవలయునని తెల్పియున్నాడు. 'ఏకత్వమే' ప్రముఖమైన విషయము. ఒకే జాతి, ఒకే కులము, ఒకే తరగతికి చెందిన మానవజాతి వారమనెడి భావము కలిగియుండుట ప్రధానము. మన అహంకారము నంతయు వదలివేసిననాడే, ప్రేమమయమైన, భక్తియుతమైన, పరిశుద్ధమైన ఈ విశ్వభావన మనయందు నెలకొల్పబడగలదు దీనికంతయు మూలము ప్రేమ ఇది సర్వజనీనము, భక్తి, ప్రేమ, సేవలు మానవుని తోటి మానవుని తోడను, మానవుని దైవముతోడను, అనుసంధానము చేయును. దీనికి సమన్వయ శక్తి కలదు.

మీకొక దృష్టాంతం చెప్పెదను వినుడు అనుచు బాబా తన జేబురుమాలును నేలమీద మా మధ్యన పరచినారు, ఇక్కడ ఒక చిన్న గుడ్డముక్క ఉన్నది కదా. ఇది అంతయు నూలుపోగులచే నేయబడినదని మన కందరకు తెలియును. దీనియందుగల నూలుపోగులు విడివిడిగా లాగివేసినచో వస్త్రము బలహీనమై రూప రహితమగును అట్లుగాక అన్నిటిని గట్టిగ కల్పినచో అది బలపడును అటులనే అనగా నూలుపోగులన్నియు కలిసిన వస్త్రమైనటుల, ప్రేమ కోట్లాది మానవాళి నంతను ఒకటిగ చేయును. అటులనే భక్తి, భక్తి దైవమును మానవుని సంధానము చేయును. కనుక నేను ప్రేమమూర్తినై మానవుని పునరుజ్జీవింపచేయుటకు ప్రేమను సాధనముగచేసి మానవులయందు విశ్వమానవ సౌభ్రాతృత్వము, నెలకొల్పజేయుచున్నాను. నేనెల్లప్పుడూ మీ దినకృత్యములను తొలుత ప్రేమతో

ప్రారంభించమని ఉద్బోధించెదను. అటు లనే దినకృత్యములను అన్నిటిని ప్రేమతో నింపుడనెదను. రాత్రులు ప్రేమతో దినకృత్యములను ముగించుడనెదను ఇది భగవంతుని సాన్నిధ్యము చేరుటకు నిశ్చయమైన దగ్గరి త్రోవ.

Life is love, enjoy it;
Life is a challenge, meet it;
Life is a song, sing it;
Life is a dream, realise it;
**Life is a game,** play it.



# ప్రశాంతినిలయంలో ఆనందోత్సాహాలు

ప్రశాంతినిలయంలో జరిగిన శ్రీ సత్యసాయి పాదుకామహోత్సవము, సాయినామ లిఖితజపమహోత్సవము' పాశ్చాత్యసంగీత మహోత్సవము, శ్రీ సత్యసాయి మంచినీటి పథక ప్రారంభోత్సవము, సాయికుళ్వంత్ నిలయప్రారంభోత్సవములు అత్యంత వైభవోపేతంగా జరిగాయి. జూలై 8 వ తేదీ మధ్యాహ్నం రాష్ట్ర నలుమూలలనుండి విచ్చేసిన షుమారు 3500 మంది దంపతులు స్వామి పాదుకలను శిరస్సున ధరించి, ఊరేగింపుగా స్వామి సన్నిధికి చేరుకుంటూ సమిష్టిగా ఉచ్చరించిన 'సాయి గాయత్రి' మంత్రఘోషతో ప్రశాంతినిలయం మారుమ్రోగింది. భక్తుల సౌకర్యార్థము నిర్మించబడిన విశాలమైన మందిర ప్రాంగణమును 9 వ తేది ఉదయం భగవాన్ బాబావారు ప్రారంభించి దానికి "సాయి కుళ్వంత్" అని నామకరణం చేసారు. దీని నిర్మాణమునకు "కుళ్వంత్‌రాయ్" అనే సాయి భక్తుడు ఒక్కడే రెండు కోట్ల రూపాయలు భూరి విరాళం యివ్వటం విశేషం తరువాత వేలాదిమంది సాయి సేవకులు (పురుషులు, మహిళలు విడివిడిగా) 154 కోట్ల సాయి నామం లిఖించిన పుస్తకములను కాషాయవస్త్రములో మూటలు కట్టుకొని, ఆ మూటలను నెత్తిన పెట్టుకొని ఊరేగింపుగా ప్రశాంతినిలయ ప్రాంగణంలో ప్రవేశిస్తుంటే, కాషాయరంగు ప్రవాహం ప్రవహిస్తున్నదా! అనిపించింది గుంటూరుజిల్లా వారు ప్రత్యేకంగా చేయించి తీసుకొని వచ్చిన స్వర్ణ కిరీటం, నెమలి సింహాసనం, బంగారు పాదుకలు, మురళి,కౌస్తుభమాల, స్ఫటికమాల, బంగారపు గ్లాసులను స్టేట్ కో-ఆర్డినేటర్ "శ్రీ కె. నారాయణరావుగారు స్వామికి బహూకరించారు. 9,10 తేదీలలో జరిగిన సంగీత మహోత్సవాలలో ప్రపంచం నలుమూలల నుండి సంగీత కళాకారులు పాల్గొని ప్రపంచ సమైక్యతను ప్రదర్శించారు. రు 235 కోట్లతో శ్రీ సత్యసాయి ట్రస్టు చేబట్టిన మంచినీటి పథకం ప్రథమ దశ ప్రారంభోత్సవం భగవాన్ బాబావారు రిమోట్ కంట్రోల్ ద్వారా ప్రశాంతినిలయంలో ప్రారంభించగా, అక్కడికి 15 కి. మీ. దూరంలోనున్న బుక్కపట్నంలో మంచినీరు ప్రజలకు అందటం ఆనాటి విశేషం ఈ ప్రథమ దశలో 155 గ్రామాలకు మంచినీరు లభ్యమైనది 11 వ తేదీన చైనా భక్తులచే ప్రదర్శించబడిన Lion Dance సభికులచేత విశేషంగా ఆకర్షించబడింది. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రశాంతినిలయంలో ఆ అయిదురోజులు ఉత్సవాలు, మహోత్సవాలతో ఆనందోత్సాహాలు వెల్లివిరిసాయి అంటే ఏమాత్రం అతిశయోక్తి కాదు.

# విద్యాలయములలో నైతిక బోధనకు పుస్తకములు

ఈనాడు పాఠశాలల్లో విద్యాబోధన యాంత్రికంగా జరుగుచున్నది. విద్యార్థులను కార్యశీలురుగాను, ఉత్తమ పౌరులుగను రూపొందించు అంశములందు కానరావడం లేదు. ఈ లోటు తీర్చి వ్యక్తివికాసానికీ, సౌశీల్య నిర్మాణానికీ దోహదం కలిగించే భావపరంపరను విద్యార్థులకు అందించడానికై ఈ క్రింది పుస్తకాలను ప్రచురించాము.

శ్రీరామా రూరల్ కాలేజి - చిలుమూరు, వివేకానంద విద్యానికేతన్ - ఖమ్మం మున్నగు విద్యాసంస్థలలో వీటిని నైతిక బోధనకు పాఠ్యగ్రంథాలుగా వినియోగించు చున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1. | చదువుకుంటే బహుమతి (23 నీతి కథలు) | 4 వ తరగతి | రు. 6-00 |
| 2. | సూక్తిసుధ ( 52 సూక్తులు, వాటి వివరణ) | 5 వ తరగతి | రు. 7-00 |
| 3. | పనికొచ్చే కథలు-1 ( 80 చిన్న కథలు ) | 6 వ తరగతి | రు. 10-00 |
| 4. | పనికొచ్చే కథలు-2 ( 80 చిన్నకథలు ) | 7 వ తరగతి | రు. 10-00 |
| 5. | కాంతిరేఖలు-1 (నిర్మాణాత్మక భావపరంపర) | 8 వ తరగతి | రు. 12-00 |
| 6. | కాంతిరేఖలు-2 (నిర్మాణాత్మక భావపరంపర) | 9 వ తరగతి | రు. 15-00 |
| 7. | కాంతిరేఖలు-3 (నిర్మాణాత్మక భావపరంపర) | 10 వ తరగతి | రు. 12-00 |
| 8. | Thoughts for all times (for English Medium) | | రు. 10-00 |

## మరికొన్ని ప్రచురణలు

| | | |
|---|---|---|
| 9. | మన మాతృభూమి (భారతదేశ విశిష్టత) | రు. 30-00 |
| 10. | మణిపూసలు-1 (Telugu Questions) | రు. 15-00 |
| 11. | మణిపూసలు-2 ,, | రు. 15-00 |
| 12. | ఎలా చదవాలి? (పరీక్షకు చదివే పద్ధతి) | రు. 6-00 |
| 13. | ఎం. ఎల్. ఎ. ఆత్మకథ (హాస్య రచన) | రు. 30-00 |

రచన : శ్రీ మన్నప గిరిధరరావు, మాజీ ఎం. ఎల్.సి.

ప్రచురణ : యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ

కృష్ణనగర్, గుంటూరు - 522 006

పోస్టేజి అదనము సగము డబ్బు మనియార్డరు చేసినచో మిగతా పైకమునకు వి పి చేయబడును.

## అందరికీ నమస్కారించి.....

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అనుగ్రహంతో, వారి దివ్యాశీస్సులతో శ్రీ సత్యసాయి శతకము, ప్రథమభాగం నవంబర్ 1993లో, ద్వితీయ భాగము నవంబర్ '94 లో, శ్రీవాణి చందాదారులకు ఉచితంగా అందించినాము. మూడవ భాగమును భగవాన్ బాబావారి 70 వ జన్మదినోత్సవ సందర్భమున శ్రీవాణి ప్రత్యేక సంచిక (నవంబర్ '95) తో పాటు అందిస్తున్నాము నాల్గవ భాగము నవంబర్ '96 లో పాఠకులకు అందించబడుతుంది

ఈ మూడు భాగములలో భగవాన్ బాబావారు భక్తులకు అప్పుడప్పుడూ అందించిన 74 పద్యములకు సందర్భోచితమైన, సముచితమైన వ్యాఖ్య యివ్వబడింది ముఖ్యంగా మానవత్వం, విద్య, సత్ప్రవర్తన, సేవ, భక్తి మొదలగు విషయములమీద బాబావారు ఆశువుగా చెప్పిన పద్యములకు చక్కటి వివరణ యివ్వబడింది ముఖ్యంగా బాలవికాస్ పిల్లలకు మరియు Study Classes లలో విపులీకరించి చెప్పడానికి ఈ 'శతకము' ఎంతగానో ఉపయోగపడుతుంది.

ఈ "శ్రీ సత్యసాయి శతకము" శ్రీవాణి చందాదారులకు నవంబర్ ప్రత్యేక సంచికతోపాటు ఉచితంగా పంపబడుతుంది. విడిగా అమ్మబడవు. కనుక క్రొత్తగా చందాదారులుగా చేరి ఈ సదవకాశమును వినియోగించుకో ప్రార్థన

ధన్యవాదములు　　　　సదా సాయి సేవలో

కొమరగిరి కృష్ణమోహనరావు

ఓం శ్రీ సాయిరాం



# శ్రీ సత్యసాయి శతకము

## (తృతీయ భాగము)

కర్మమార్గంబు విడరాని కాలిబాట
భక్తిమార్గంబు సులువైన బండి బాట
జ్ఞానన విమానంబుపై యాన మరయ
యోగమన నింక జలధిపై ఓడకాదె.

"కర్మ:భక్తి జ్ఞానములను గూర్చి పనికిరాని చర్చలు కొనసాగుతూ వుంటాయి. ఇవి వేరు వేరని కొందరు భావిస్తుంటారు. ఇది పొరపాటు. ఈ మూడు సాధనా మార్గాలు మూడు చక్రాల సైకిలు

వంటివి. ముందు చక్రం కర్మ. వెనుక ఒకే వరుసలో గల రెండు చక్రాలు భక్తి జ్ఞానములు" అని అంటారు భగవాన్ శ్రీసత్యసాయిబాబావారు.

"కర్మమార్గం కాలిబాట, భక్తిమార్గం బండ్లబాట, జ్ఞానమార్గం గాలిబాట (విమానయానం), యోగమార్గం నీటిబాట (ఓడ ప్రయాణం)" అని బాబావారు వివిధ యోగ స్వభావాలను తెలుపుతూ, అన్ని బాటలూ చేరే గమ్యం ఒకటే నన్నారు. ఏ బాటన పోయినా గమ్యం చేరవచ్చుననీ, అందువలన ఒకబాటన పోయినా, అన్ని బాటల గమ్యాన్ని చేరుకోవచ్చునని బోధించారు.

మానవునిలో ఈ మూడు యోగాలు త్రిగుణాలుగా, త్రివేణీ సంగమంలా ఉంటాయని బాబా చెప్పారు. ఈ త్రివేణీ సంగమంలో గంగానది భక్తియోగం, యమునానది కర్మయోగం, అంతర్వాహినిగా, కనపడకుండా ఉండే సరస్వతీనది జ్ఞానయోగమని చెబుతూ, ఈ యోగత్రయాన్ని విడదీసి చూపడానికి వీలులేదన్నారు బాబా.

మానవుడు కర్మ, భక్తి, జ్ఞానమనేటటువంటి త్రిమూర్తి స్వరూపాన్ని ధరించి ఉంటున్నాడు. కనుక త్రిగుణాత్మక స్వరూపుడు మానవుడు. ఇట్టి త్రిగుణాత్మకమైన మానవత్వం కర్మద్వారా పవిత్రము కావించి, భక్తి ద్వారా శాంతము నలవరచుకొని, తద్వారా జ్ఞానమనే గమ్యమును చేరడము దీనియొక్క ప్రధానమైన లక్షణము. పవిత్రమైన కర్మల నాచరించటానికి సమాజ సేవలు చేయటానికి ఈ దేహమును అంకితం చేయటమే సరియైన 'సత్కర్మ'అన్నారు బాబా.

భగవాన్ బాబా ఒక పర్యాయం కర్మయే భక్తి, భక్తియే జ్ఞానమంటూ మైసూరుపాకు ఉదాహరణ చెప్పారు. మైసూరుపాకును నోటిలో వేసుకొన్న వెంటనే దాని ఆకారమును తినివేస్తాం, దాని బరువును జీర్ణించుకుంటాం, దాని

మాధుర్యాన్ని ఆస్వాదిస్తాం. ఈ మూడు పనులూ కలిసి ఒకేసారి జరిగినవి కదా! ఒక కణమున ఆకారము, ఒక కణమున బరువు, ఒక కణమున మాధుర్యమూ అంటూ విడివిడిగా లేవు. అదే విధముగనే జీవుడు, ఆత్మ, పరమాత్మ వేరు వేరు కాదు. ప్రతి కార్యము సేవామయము, జ్ఞానమయము కావలెను. జీవితము యొక్క విభాగములన్నింటిలోనూ కర్మ, భక్తి, జ్ఞానములు నిండియుండవలెను. ఇట్టి దానినే 'పురుషోత్తమ యోగము' అందురని బాబా పేర్కొనినారు.

వేదాలలో మొదటి భాగమైన 'సంహిత' కర్మను ప్రబోధిస్తుందని, రెండవ భాగమైన 'అరణ్యకము' ఉపాసనను (భక్తి) వివరిస్తుందని, మూడవ భాగమైన 'ఉపనిషత్తు' జ్ఞానాన్ని అందిస్తుందని స్వామి ఒక పర్యాయం చెబుతూ ఈ మూడూ వేదాలలో భాగములే కాబట్టి వీటిని విడదీయరాదని స్పష్టం చేస్తూ "కర్మ పుష్పం, భక్తి కాయ, జ్ఞానము ఫలము వీటిలో ప్రతిదానిలోను మిగిలిన రెండింటి ప్రతిబింబము స్పష్టంగా కనిపిస్తుంది. ఇవి వేరు వేరు కావు. మోక్ష సాధనకు అవి మెట్లు వంటివి" అని బాబా చెప్పారు.

కర్మ మార్గం రైలులోని మూడవ తరగతి (IIIrd class) ప్రయాణం లాంటిదని, భక్తిమార్గం రైలులోని రెండవ తరగతి (IInd class) ప్రయాణం లాంటిదని, జ్ఞానమార్గం రైలులోని మొదటి తరగతి (Ist class) ప్రయాణం లాంటిదని (పూర్వం రైలులో మూడు తరగతులు ఉండేవి) చెబుతూ... ఈమూడు మార్గముల గమ్యమొక్కటే నని బాబా చెప్పారు. మరొకసారి, ఒక రైలుబండిలోని మామూలు బోగి (Ordinary Compartment) లో ఎక్కి జంక్షన్‌లో దిగి, మరియొక్క రైలులోనికి మారి వెళ్లవలసిన ఊరికి వెళ్ళడం కర్మమార్గంతో పోల్చారు స్వామి. రైలు బండిలోని సరాసరి వెళ్లే కేరేజి (Direct Compartment) లో కూర్చుంటేచాలు. జంక్షన్‌లో ఆ కంపార్టుమెంటును మరొక రైలుకు

తగిలిస్తారు. మనం మాత్రం దిగనవసరం లేదు. చేరుకోవలసిన గమ్యానికి ఎట్టి యిబ్బంది లేకుండా చేరుకుంటాం. దీనిని భక్తి మార్గంతో పోల్చారు స్వామి. సరాసరి వెళ్ళే రైలులో కూర్చుంటే చాలు. ఏ యిబ్బందీ లేకుండా, రైలు మారకుండా చేరుకోవలసిన గమ్యానికి చేరుకోవచ్చును. దీనిని జ్ఞానమార్గంతో పోల్చారు స్వామి. ఏ విధంగా ప్రయాణం చేసినా చేరుకోవలసిన గమ్యం మాత్రం ఒకటే అంటారు బాబా.

పొయ్యికి పెట్టిన మూడు రాళ్ళను కర్మ, భక్తి, జ్ఞానయోగములుగా పోల్చారు స్వామి. పొయ్యిమీద గిన్నెను పెట్టి, గిన్నెలో నీళ్ళను పోసి, బియ్యం పోసి, గిన్నె క్రింద మంట (అగ్ని) ను పెట్టాలి. అప్పుడే అన్నం ఉడుకుతుంది. గిన్నె భక్తి, నీరు కర్మ, అగ్ని జ్ఞానముతో పోల్చి, అన్నం ఉడికిన తరువాత ప్రేమతో వడ్డించాలని బాబా చెప్పారు. కర్మ, భక్తి, జ్ఞాన యోగముల సారం సమత్వం. సమత్వమే యోగం. అందువలననే 'సమత్వం యోగముచ్యతే' అన్నాడు శ్రీ కృష్ణపరమాత్మ.

కనుక కర్మ భక్తి జ్ఞానమార్గములు వేరు వేరని భావించరాదు. ఇవి త్రిమూర్తులవంటివి. త్రివేణి సంగమం వంటివని గ్రహించాలి. ఈ మూడింటిని విడదీయరాదు. ఈ మూడు మార్గముల గమ్యం ఒక్కటే. స్వభావం చేత అవి వేరైనా, పరమార్థ సాధనంలో గమ్యాన్ని చేరటంలో మూడూ ఒక్కటేనని బాబా వారి అభిప్రాయం.

**తామసంబు విడక తత్వంబు కనరాదు**
**రాజసంబు విడక రాదు భక్తి**
**సాత్వికంబె భక్తి సాధనం బగునయా**
**ఉన్నమాట తెలుపుచున్నమాట**

భగవాన్ బాబావారు ఈ పద్యంలో సత్వరజస్తమో గుణములను గురించి చెప్పారు. మానవుడు సత్వగుణము నందున్నాడా? రజోగుణము నందున్నాడా? లేక తమోగుణమునందున్నాడా? అనే విచారణ వచ్చినప్పుడు, దానికి అతని ప్రవర్తనే ప్రత్యక్ష నిదర్శనము.

మానవునిలో తమోగుణం ప్రబలితే మత్తు, సోమరితనం, బుద్ధిమాంద్యం, అజాగ్రత్త మొదలగు అవలక్షణాలు పెరుగుతాయి. తనయందున్న దోషములను గుర్తించటానికి ఏమాత్రం ప్రయత్నించడు. రజోగుణము ప్రకోపించినప్పుడు అశాంతి, ఇంద్రియలోలత్వము, మితిమీరిన ఆశలు, లోభత్వం మొదలగునవి పుట్టుకొనివస్తాయి. తన యందున్న దోషములను గుర్తించి కూడను, వాటిని మార్చుకొనక, అదియే సత్యమని భావించి, తిరిగి అట్లే ప్రవర్తిస్తుంటాడు. సత్వగుణము నిర్మలమైనది అగుట వలన జ్ఞానము కలుగజేయునదియు, ఉపద్రవము లేనిదియు అగుచున్నది. తన దోషములను గుర్తెరిగి, వాటిని మార్చుకొని, పవిత్రమైన మార్గంలో ప్రవేశిస్తాడు.

సాత్వికమైన కర్మమునకు 'నిర్మలత్వం' ఫలమనియు, రజోగుణ సంబంధమైన కర్మమునకు'దుఃఖము' ఫలమనియు, తమోగుణ సంబంధమైన కర్మమునకు 'అజ్ఞానము' ఫలమనియు భగవద్గీత బోధిస్తున్నది. విభీషణుడు సత్వగుణమునకు, రావణుడు రజోగుణమునకు, కుంభకర్ణుడు తమోగుణమునకు ప్రతీకములని భగవాన్ బాబా పేర్కొనినారు.

"సాత్వికగుణము బంగారు గొలుసు వంటిది. రజోగుణము రాగి గొలుసు వంటిది. తమో గుణము ఇనుప గొలుసు వంటిది. గొలుసులు వేరు వేరు. వాటి విలువలు కూడా వేర్వేరు. కాని బంధన మాత్రం ఒక్కటే. కనుక సాత్విక బంధమును కూడా తీసివేయాలి' అంటారు బాబా.

రత్నాకరుడనే బోయవాడు ఒకప్పుడు గజదొంగ. తరువాత జ్ఞానోదయమై. తన తామసిక జీవితానికి స్వస్తి చెప్పి. తమస్సును విడిచి. తపస్సును చేబట్టి మహర్షి వాల్మీకిగా ప్రసిద్ధి గాంచాడు. రజోగుణం ప్రకోపించడం వలన తపశ్శక్తి సంపన్నుడైన విశ్వామిత్రుడు అనేక అవమానాలకు లోనై. కట్టకడపటికి అహంకారమును వీడి 'బ్రహ్మర్షి' అనిపించుకున్నాడు. సాత్వికుడు. నిగర్వి అయిన వశిష్ట మహర్షి. తనపై అసూయాద్వేషం పూనిన విశ్వామిత్రుని యెడల కూడా సహనమును చూపించి, అతనిలో పరివర్తన తీసుకొని రాగలిగిన సహనశీలిగా పేరుతెచ్చుకున్నాడు. కనుక మానవుడు అభ్యాసంతో, కృషితో తనలో జీర్ణించుకుపోయిన తమోరజో గుణాలను క్రమక్రమంగా దూరం చేసుకొని సత్వగుణ సంపన్నుడు కావచ్చును. అదే ఆధ్యాత్మిక దివ్యసాధన. భక్తికి అదే రాజమార్గం.

"మొట్టమొదట మనలో నున్న తామసమును దూరము చేయాలి. కేవలం తిండి తీర్థాదులకై వచ్చినదా ఈ కాయం ? కాదు... కాదు... ఆహార నిద్రా భయ మైథునాదులతో వుండేది పశుత్వం. దీనికి అతీతమైన గుణం మరొకటి ఉంది. అదే విచక్షణాశక్తి. దివ్యమైన శక్తి జ్ఞానం. తమస్సు పోకుండా పవిత్రమైన జ్ఞానం లభ్యం కాదు. తమస్సు పోయిన తరువాత రాజసికము వుంటుంది. దానిని కూడా దూరం చేయాలి. అప్పుడే సాత్వికం ఆవిర్భవిస్తుంది. ఇది ఆవిర్భవించినప్పుడే తేజోమయమైన దివ్యత్వం కనిపిస్తుంది" అంటారు బాబా.

ఒక పర్యాయం కొబ్బరికాయ కొట్టటం గురించి భగవాన్ బాబా చక్కగా వివరించారు. అభిమాన మమకారములనే పీచును మొట్టమొదట తీసివేయాలి. అదే తమోగుణం. తరువాత పైన వున్న అహంకారమనే గట్టి పెంకును

పగులగొట్టాలి. అదే రజోగుణం. అప్పుడు నిర్మల, నిశ్చల, నిస్స్వార్థమనే తెలుపు (కొబ్బరి) మనకు చిక్కుతుంది. అదే సాత్విక గుణం. కొబ్బరికాయను ఏవిధంగా బ్రద్దలు చేస్తామో, ఆవిధముగా మన హృదయమును బ్రద్దలు చేయాలి. అంటే మర్మం లేకుండా సర్వమూ అర్పితం చేయాలంటారు బాబా. అదే నిజమైన సాధన. అదే నిజమైన భక్తి.

కర్మమున పుట్టు జంతువు
కర్మముననె వృద్ధి పొంది, కర్మముననె చనున్
కర్మమె నరునకు దైవము
కర్మమె సుఖదుఃఖములకు కారణమరయన్.

"దేశ సమస్యలను ధైర్యంగా ఎదుర్కొనుటకు కర్మవీరులుగా, కర్మయోగులుగా, కర్మయోధులుగా తయారుకావాలి." అని భగవాన్ బాబావారు ఒక పర్యాయం యువతను హెచ్చరించారు. కర్మయే మనకు ప్రధానం. కర్మయే లేకపోతే లోకమంతా స్థంభించిపోతుంది. మనము కర్మము నందే పుట్టాం. కాయము యిచ్చినది కర్మ నిమిత్తమే. ఈ కాయ కర్మములు రెండు కాల కారణముల ననుసరించి ఉంటాయి. మనము మన కాయమును, కాలమును, మన కర్తవ్యకర్మలను పవిత్రము గావించుకునే ప్రయత్నములో మునిగి ఉండాలి. జీవితమును సుఖదుఃఖములనే తరంగములతో కూడిన సాగరమని భావించాలి. విశ్వాసమనే పడవను తయారుచేసి, దానికి చిల్లులు లేకుండా చూచి, ఆవలి ఒడ్డునకు సురక్షితంగా చేరే మార్గము నన్వేషించాలంటారు బాబా.

"జంతూనాం నరజన్మ దుర్లభమ్" అన్నారు గదా! ఎనభై నాలుగు లక్షల జీవరాసులలో మానవ జన్మ ఎంతో ఉత్కృష్టమైనది, పవిత్రమైనది. ఇలాంటి మానవజన్మ ఎత్తి, తుచ్ఛములయిన క్రియలలో జీవితమును అంకితము

గావించి కేవలము అపవిత్రమూ, నిరర్థకము గావించుకొనిన, మానవజన్మ ఎత్తి, ఏమి సార్థకము? ప్రాప్తించినటువంటి మానవజన్మను సార్థకం గావించుకొని, పవిత్రమైన మార్గములోపల పరులకు ఆదర్శవంతమైన జీవితము నందించి, మీరునూ అనుభవించి ఆనందమును పొందాలంటారు బాబా. అహంకార మమకారములతో ఆచరించే ప్రతి కర్మ దుఃఖమయముగా రూపొందుతుంది, బంధహేతువు అవుతుంది. దైవార్పణ భావంతో చేసిన కర్మలన్నియూ యోగముగా మారుతాయి. అహంకారం అధికమయ్యే కొలది ఆత్మానందం తరిగిపోతుంది. అహంకారం నిర్మూలనం గావించే నిమిత్తమై కర్మను యోగముగా మార్చుకోమని కృష్ణుడు బోధించాడు.

" తస్మై నమః కర్మణే " అన్నారు. జీవుడు మొట్టమొదట కర్మను ఆరాధనచేసి కర్మమునకు నమస్కరించి ప్రారంభం చేయాలి. కారణ మేమనగా మానవుని యొక్క పాపమునకుగాని, పుణ్యమునకుగాని; మంచికిగాని, చెడ్డకుగాని; ఊర్ధ్వస్థితికిగాని, అధోస్థితికి గాని కాలమే ప్రమాణము, కాలమే ప్రధానము. కనుక "ఓ కాలస్వరూపుడైన దేవుడా! నన్ను పవిత్రమైన రీతిలో ప్రవేశపెట్టి నా కర్మలు సార్థకమైనవిగా తీర్చిదిద్ది నీ సన్నిధిలో, నీ పెన్నిధిలో నన్ను ఉంచుకో!" అని ప్రార్థించాలిట.

కాలమును ధిక్కరించి ఏ జీవి జీవించుటకు వీలుకాదు, కాలము ఎవరి కోసమూ ఆగదు. జీవుడు కాలమును అనుసరించవలసిందే. కానీ కాలము జీవుని అనుసరించదు. కాలము పెద్ద ప్రవాహము వంటిది. ఈ కాలప్రవాహంలో కొట్టుకొని పోయేవ్యక్తి, ఒడ్డును ఆశ్రయించినప్పుడే తాను రక్షితుడు కాగలడు. ఆ ఒడ్డే దైవం. అట్టి దైవాన్ని ఆశ్రయించిన వ్యక్తి ఈ కాలప్రవాహమునకు దూరమై; బాధలకు, దుఃఖములకు, విచారములకు దూరమై ఆనందంలో తన కాలమును అంకితం గావించుకోగలడంటారు బాబా.

సాధనలు చేసి ఫలమేమి శమము లేక
యోగములు పూని ఫలమేమి ఓర్పులేక
జపము లొనరించి ఫలమేమి శాంతి లేక
చవిటి భూమిని దున్నిన సరణి కాదె.

" సాధనమున పనులు సమకూరు ధరలోన " అన్నారు బాబా. నడవటానికి ప్రయత్నం చేస్తే చీమైనా కొన్ని మైళ్ల దూరం ప్రయాణం చేస్తుంది. ఎగరటానికి ప్రయత్నం చేయకపోతే గ్రద్ద ఒక గజం దూరమైనా ప్రయాణం చేయలేదు. ధ్రువుడు సాధన వలననే ధ్రువపదాన్ని పొందగలిగాడు. గరుత్మంతుడు సాధన వలననే అమృతాన్ని సాధించి మాతృదాస్యమును తొలగింపగలిగాడు. కనుక సర్వ ఫలితములు సాధన మీదనే ఆధారపడి ఉన్నాయి. ప్రయత్నం లేకుండా ఏ పనీ సాధించబడదు.

ఆత్మసాక్షాత్కార సాధనలో కలిగే అడ్డంకుల కన్నింటికీ రాగద్వేషాలే మూలకారణం. వాటిని జయించటమే సాధన. మనం ఎన్నుకొనే మార్గం అది ఏదైనా గమ్యం మాత్రం ఒక్కటే. అదే ఆత్మసాక్షాత్కార మంటారు బాబా.

కామక్రోధాదులు అణచుకోలేని సాధనలు ఎన్ని చేసినా ప్రయోజనం లేదు. అరిషడ్వర్గములను అరికట్టుకోలేని సాధనల వలన ప్రయోజనమేమిటి ? కామ, క్రోధ, లోభములే సాధకునికి పరమ శత్రువులు. కామం పెరిగి పెనవేసుకొని, ఉరిగా మారిపోయి, తనతోపాటు తన వంశమునే నాశనం గావించుకున్నాడు రావణాసురుడు. పంచభూతములను వశం చేసుకొన్న హిరణ్యకశిపుడు క్రోధంతో సర్వనాశనం అయినాడు. దుర్యోధనునిలో అసూయ పెరిగి, ద్వేషం పెల్లుబికి, లోభంతో ధర్మమూర్తులైన పాండవులకు సూదిమొన మోపే స్థలం కూడా యివ్వడానికి నిరాకరించి, తనతోపాటు తన కుటుంబాన్నే సర్వనాశనం గావించుకున్నాడు. "రామాయణం లోపల కామం, భాగవతం లోపల

క్రోధం, భారతంలోపల లోభం ఈ మూడింటి ద్వారానే సర్వశక్తివంతులైనవారు సహితం సర్వనాశనం అయినారు'' అంటారు బాబా. కనుక కామ, క్రోధ, లోభము (శమము)లు అణచుకోలేని సాధనల వలన ప్రయోజనం శూన్యం.

దుర్వాస మహాముని యోగి. కాని ప్రయోజనం ఏమిటి ? ఓర్పు అనేది ఆయనలో భూతద్దం వేసి వెతికినా కనిపించేది కాదు. ఓర్పు. ఓర్మి. సహనములను కోల్పోయినట్లయితే. ఎంతో కాలం శ్రమించి. సాధించిన యోగఫలం ఒక్క క్షణంలో భస్మీపటలం అయిపోతుంది. ఈ సద్గుణమే లోపించినందువలననే ఎంతోమంది మహాతపఃసంపన్నులు యోగభ్రష్టులై పోయినారు. భర్తృహరి క్షమను కవచంతో పోల్చాడు. ఓర్పు అనే కవచం గల క్తిని భౌతికమైన కష్టములు ఏమీ చేయలేవు. కనుక ఓర్పు ఓర్మి సహనములను సాధించలేని యోగములు నిష్ప్రయోజనం.

ఎన్ని జపతపము లొనరించినప్పటికీ శాంతిలేని వానికి సుఖం లేదు. సాధకుడు అంతిమ లక్ష్యానికి చేరుకోవటానికి మొదటగా చేరాల్సిన తొలి మజిలీ 'శాంతి'. మన సంకల్ప వికల్పములే మనకు మనశ్శాంతిని లేకుండా చేస్తున్నాయి. " అశాంతికి మూలం అదుపులేని ఆశలు, కళ్ళాలు లేని కోరికలే " అని అంటారు బాబా.

నిజమైన శాంతిని పొందగోరువారు సంసారమును వదలిపోనక్కరలేదు లోకాన్ని. సంసారాన్ని వదలివెళ్ళి దూరంగా ఉన్నంతమాత్రమున శాంతి లభించదు. ఆర్భాటంగా చేసే జపతపాదుల వలన నిజమైన శాంతి లభించదు. " అంతఃకరణమునందు వాసనలను విచారణాగ్నిచే మాడ్చినప్పుడే నిజజ్ఞాని కాగలడు. నిజశాంతిని అనుభవించగలడు " అని అంటారు బాబా. ముప్పైవేల సంవత్సరాలు ఘోరతపస్సు చేసినా విశ్వామిత్రునికి శాంతి

లభించలేదు. అంతఃశత్రువులను జయించనిదే మానవునికి శాంతి లేదు. శాంతిని సాధించడానికి ఇంద్రియ నిగ్రహం, శమదమాదులే ముఖ్యము కాని జపతపాదులు కావనే సత్యాన్ని విస్మరించరాదు.

శమములేని సాధనలు, సహనము లేని యోగములు శాంతిని చేకూర్చని జపతపాదుల వలన ఎంతటి ప్రయోజనమో! చవిటి భూమిని దున్నినా అంతే ప్రయోజనం.

దుష్టసంకల్పముల చేత దుఃఖితుడగును
సత్యసంకల్పముల చేత సాధువగును
సకల సంకల్ప శూన్యుడే శాంతినొందు
సత్యమును తెలుపుబాట శ్రీ సాయి మాట

' మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ' బంధమునకు, మోక్షమునకు మన మనస్సే కారణం. మంచిచెడ్డలకు, సుఖదుఃఖములకు మన మనస్సే మూలం. సర్వ సంకల్పములకూ మూలం మన మనస్సే. "సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్తి" అంటారు బాబా. సంకల్పము యొక్క శక్తి కఠినమైన రాతి కంటె మరింత కఠినంగా ఉంటుంది. మన అదృష్టం, మన దురదృష్టం మన సంకల్పములపైననే ఆధారపడి ఉంది. దుష్ట సంకల్పములచేత మానవుడు దుఃఖితుడగును. ఉత్తమ స్థాయి నుండి అథమ స్థాయికి త్రోయబడును. సత్సంకల్పముల చేత మానవుడు సాధుగుణములను అలవరచుకొనును. ఉన్న స్థాయి నుండి ఉన్నతమైన స్థాయికి కొనిపోబడును.

సత్సంకల్పములు, సదాలోచనలు, సద్భావములను అభివృద్ధి పరచుకున్నప్పుడు మానవుని యొక్క మనస్సు పరిశుద్ధమైనదిగా ఉంటుంది.

పరిశుద్ధమైన, నిర్మలమైన మనస్సు ఉండినప్పుడే పరిశుద్ధమైన, పవిత్రమైన కర్మలు ఆచరిస్తారు. పరిశుద్ధమైన, పవిత్రమైన కర్మల వలన పరిశుద్ధమైన, పవిత్రమైన ఫలితమే మనకు ప్రాప్తిస్తుంది.

"సంకల్పమనే బీజమును నాటి కర్మలనే ఫలమును పొందుతున్నాము. కర్మబీజమును నాటి స్వభావమనే ఫలమును పొందుతున్నాము. శీలమనే బీజమును నాటి అదృష్టమనే ఫలమును పొందుతున్నాము. సంకల్పము మొదలుకొని అదృష్టము వరకూ మానవుని యొక్క ప్రభావము ఈ విధంగా ప్రసరిస్తూ వస్తుంది. కనుక మన అదృష్టాదృష్టములు మన సంకల్పములపైననే ఆధారపడి ఉన్నాయి" అని అంటారు బాబా.

మనస్సు నిర్మలం, బుద్ధి నిశ్చలంగా ఉన్నప్పుడు సరియైన సముచితమైన నిర్ణయాలను గైకొనగలుగుతాము. సత్ఫలితాలను అందుకోగలుగుతాం. ఒకవేళ మన మనస్సు మలినమైతే మన భావాలు దుర్భావనలు అవుతాయి. మన ఆలోచనలు దురాలోచనలవుతాయి, దుష్ఫలితాలను అందిస్తాయి.

" సంకల్పమే ప్రధానమైన సూత్రం, సంకల్పమే మానవునకు ప్రధానమైన ప్రాణం " అంటారు బాబా. మానవుడు పరుల యొక్క కీడు కోరి అనేక దుష్టసంకల్పములు గావించుకుంటాడు. అవి ఎదుటివానికి కీడు చేసినప్పటికినీ, అంతకంటే పదింతలు తిరిగివచ్చి తనకే కీడు చేస్తాయి. ఈ సత్యము మానవుడు గుర్తించలేకపోతున్నాడు. సర్వులయందూ వున్న దివ్యత్వాన్ని గుర్తించలేక, ఎదుటి వ్యక్తిని హీనమైన రీతిగా హింసించడానికి ప్రయత్నిస్తున్నాడు మానవుడు. పరులను బాధిస్తున్నాడనుకుంటున్నాడు గాని పరమాత్మనే బాధిస్తున్నాడు. ఈ వాస్తవాన్ని విస్మరిస్తున్నాడు.

అసలు శాంతి అంటే ఏమిటి ? తనలోని తప్పులను, ఎవరు వేలెత్తి చూపినా, ఏమాత్రం ఉద్రేక పడక సంతోషంగా కృతజ్ఞత నందించేది 'శాంతి'. ఇది సర్వసంకల్ప రహితునకే సాధ్యపడుతుంది. అనగా ప్రేమతో హృదయం విచ్చుకున్నప్పుడే ఇది సాధ్యపడుతుందంటారు బాబా. ''ఇంద్రియ నిగ్రహమే నిశ్చల శాంతి నిచ్చును. శాంతి ప్రశాంతిని తెచ్చును. ప్రశాంతియే పరంజ్యోతి'' అన్నారు బాబా.'ప్ర' అనగా వికసింపజేయుట. 'శాంతి' అనగా కామక్రోధ రాహిత్యము. కామక్రోధరాహిత్యమును వికశింపజేయుటే 'ప్రశాంతి' అంటారు బాబా. ఈ శాంతిబాహ్య ప్రపంచంలో దొరికేది కాదు. దానిని మన హృదయమునందే వెదికి సంపాదించుకోవచ్చును. '' శాంతి కావాలంటే సంకల్ప శూన్యులు కావాలి. అందరిలో నున్న ఆత్మస్వరూపం ఒక్కటేనన్న సత్యాన్ని గుర్తించాలి. భేద భావమనే భ్రాంతితోపాటు దేహభ్రాంతిని కూడా దూరం చేసుకోవాలి '' అంటారు బాబా.

కనుక దుష్ట సంకల్పాలను దూరం గావించుకొని, సత్సంకల్పాలను అభివృద్ధి పరచుకోవటానికి ప్రయత్నిస్తూ, చిట్టచివరికి సంకల్పశూన్యస్థితికి చేరుకొని మనశ్శాంతిని పొందుదాం. ప్రపంచ శాంతికి తోడ్పడుదాం.

**నమ్మకమను రెండు నయనంబులే లేని**
**అంధులైరి జనులు అవనియందు**
**తాము చూడకున్న దైవంబు లేడొకో !**
**తనకు లేదు గాని మనకు లేద ?**

ఆత్మరూపుడైన భగవంతుణ్ణి చూడటానికి నమ్మకమే మానవునకు రెండు నయనాలని భగవాన్‌బాబా వారు ప్రబోధించారు. ఈనాడు ఆధునిక

మానవ సమాజంలో అశాంతి చెలరేగటానికి మూలకారణం దైవత్వం మీద, మానవత్వం మీద నమ్మకం లేకపోవటమే. శాస్త్రములయందు, గురువులయందు, దైవమునందు పరిపూర్ణ విశ్వాసం, అచంచలమైన భక్తిశ్రద్ధలతోపాటు ఆత్మవిశ్వాసం కూడా వుండాలి. దైవత్వాన్ని నమ్మటమంటే తన ఆత్మధర్మాన్ని తాను నమ్మటం. మానవత్వాన్ని నమ్మటమంటే తన మనుగడనే తాను నమ్మటం. ఒక పర్యాయం స్వామి వివేకానంద "Faith, Faith in ourselves, Faith, Faith in God, that is the secret of Greatness" 'నమ్మకం, నమ్మకం తన యందు నమ్మకం, దేవునియందు నమ్మకం - ఇదే ఔన్నత్యమునకు విజయమునకు కీలకం' అన్నారు. ప్రపంచంలో ఈనాడు చాలామందిలో విశ్వాసం, నమ్మకం లోపించినందువల్లనే లక్ష్యమును చేరుకోలేకపోతున్నారు.

"సంశయాత్మా వినశ్యతి" సందేహించు మనస్సు గలవాడు పూర్తిగా నశించుచున్నాడని దీని అర్థము. ఆత్మవిశ్వాసానికి చేదపురుగు అనుమానం. అనుమానం పెనుభూతం. అనర్థాలకు మూలం అనుమానం సంశయం సర్వనాశనానికి దారి తీస్తుంది. అపనమ్మకం అరిష్టాన్ని తెచ్చిపెడుతుంది. అవిశ్వాసం ప్రగతికి అవరోధం. సంశయంతో, అపనమ్మకంతో, అవిశ్వాసంతో ఏ పని ప్రారంభించినా సఫలీకృతం కాదు. కనుక సంశయాలను విడనాడి, తనశక్తిమీద నమ్మకం వుంచి, దైవం మీద విశ్వాసముంచి, ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలి. అప్పుడే ఈ జీవన సంగ్రామ రంగంలో విజయలక్ష్మిని చేబట్టగలుగుతాం.

" నీ కండ్లకు కనపడకున్నంత మాత్రమున దేవుడే లేడనడం అవివేకం. నీకు లేడు కనుక మాకు లేడనుకోకు. విశ్వాసమున్న వారికి ఎప్పుడూ ఉంటాడు" అంటారు బాబా. భూమి కొన్నివేలమైళ్ళ వేగంలో తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని.

